శ్రీః

భోజరాజకృతా

# వాగ్దేవీస్తుతిః

'కచ్ఛపీ' వ్యాఖ్యాసహితా

వ్యాఖ్యాతా

శ్రీ మేళ్ళచెఱ్వు వేఙ్కటసుబ్రహ్మణ్యశాస్త్రీ




ప్రకాశకులు

**శ్రీ జ్ఞానసరస్వతీ పీఠం**

శ్రీ పరమాత్మానందాశ్రమం, పెనమలూరు, విజయవాడ.

శ్రీః

భోజరాజకృతా

# వాగ్దేవీస్తుతిః

కచ్ఛపీ వ్యాఖ్యా

శ్రీ మేళ్ళచెఱ్వు వేఙ్కటసుబ్రహ్మణ్యశాస్త్రీ
సంస్కృతాధ్యాపకః,
శ్రీ గోరంట్ల వెంకన్న సంస్కృత కళాశాలా, తిమ్మసముద్రమ్.

ప్రథమ ముద్రణమ్ : పార్థివ నామ సంవత్సరః - **05.10.06**


404, Janjanam Complex,
**Chirala-523 155**
Cell : 9440115411

పృష్ఠ సఙ్ఖ్యా : **52**
మూల్యమ్ : రూ. **20/-**
ద్వితీయ ముద్రణమ్ : దుర్ముఖ నామ సంవత్సరః - శ్రావణమాసః

**D.T.P. by**
**SANJAY GRAPHICS,**
**Chirala**
**Cell : 9966156263**

**Printed at**
**KARSHAK ART PRINTERS**
**Hyderabad.**

# శ్రీ వాగ్దేవీకటాక్షము

శ్లో॥ విద్యాకైరవకౌముదీం శ్రుతిశిరస్సీమంతముక్తామణిం
దారాన్ పద్మభువస్త్రిలోకజననీం వందే గిరాం దేవతామ్ ।
యత్పాదాబ్జనమస్క్రియాస్సుకృతినాం సారస్వతప్రక్రియా
బీజన్యాసభువో భవంతి కవితానాట్యైకజీవాతవః ॥
– శ్రీవిద్యానాథకవీంద్రుడు

శ్లో॥ శరదిందుమందహాసాం – స్ఫురదిందీవరలోచనాభిరామామ్ ।
అరవిందసుందరాస్యా – మరవిందాసనసుందరీముపాసే ॥

ఈ రెండు సరస్వతీశ్లోకాలు నేను తెనాలిలో కె.యల్.యన్. సంస్కృత కళాశాలలో భాషాప్రవీణ చదివేరోజుల్లో ఉదయం చేసే ప్రార్థనా శ్లోకాల్లో ఉండేవి. వీటితోపాటు “జ్ఞానానందమయం దేవమ్....” అనే హయగ్రీవశ్లోకం, మఱికొన్ని కూడా ఆ కాలంలో మా ప్రార్థనాశ్లోకాల్లో ఉండేవి. ఈ హయగ్రీవశ్లోక మిప్పటికీ నాకు అనుష్ఠానంలో ఉంది. అయితే కళాశాలవిద్య ముగిసిన తరువాత ఈ క్రింది సుప్రసిద్ధ శ్లోకం నా జీవితంలో ప్రవేశించింది.

శ్లో॥ యా కుందేందుతుషారహారధవళా యా శుభ్రవస్త్రాన్వితా
యా వీణావరదండమండితకరా యా శ్వేతపద్మాసనా ।
యా బ్రహ్మాచ్యుతశంకరప్రభృతిభిర్దేవైస్సదా పూజితా
సా మాం పాతు సరస్వతీ భగవతీ నిశ్శేషజాడ్యాపహా ॥

ఈ సరస్వతీశ్లోకం కూడా ఇప్పటికీ నా అనుష్ఠానంలో నడుస్తున్నది. ఈ శ్లోకంలోని నాలుగవ పాదం మహామంత్రమని కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారు తమ వ్యాసాల్లో వ్రాయగా నేను చిన్నప్పుడు చదివినట్టు గుర్తు. అనఁగా “సా మాం పాతు సరస్వతీ భగవతీ నిశ్శేషజాడ్యాపహా” అంటూ మాటిమాటికి ఈ వాక్యాన్ని మననం చేసేవారికి కూడా సారస్వతసారం లభిస్తుందని రహస్యార్థం.

నేను ది. 30-06-1984న విజ్ఞాన్ జూనియర్ కాలేజి (వడ్లమూడి, గుంటూరు జిల్లా)లో లెక్చరర్‌గా ప్రవేశించి తెలుఁగు మఱియు సంస్కృతం బోధించటం మొదలు పెట్టాను. అప్పుడు అన్ని సెక్షన్లలోనూ కలిపి తెలుఁగు చదివే విద్యార్థులు యాభైలోపే ఉండేవాళ్లు. తక్కినవాళ్లంతా ద్వితీయభాషగా సంస్కృతం తీసుకున్న వాళ్లే.

అంచేత రెండేళ్ల తర్వాత తెలుఁగును రద్దుచేయించి సంస్కృతం మాత్రమే బోధించేలా శ్రీలావు రత్తయ్యగారిని ఒప్పించాను. ఒక్క సంస్కృతాన్ని మాత్రమే బోధించటంవల్ల నాకూ నా అసిస్టెంట్లకూ సౌకర్యం పెరిగింది. ఆ తరువాత విజ్ఞాన్ కాలేజిని అనుకరిస్తూ కాలేజీలు స్థాపించినవారు ప్రారంభంనుంచే సంస్కృతానికి ప్రాముఖ్యమిచ్చారు.

**ఈ వాగ్దేవీస్తుతి తెలుఁగు నేలకు వచ్చిన వైనం :**

ఆనాటి యింటర్మీడియట్ సంస్కృతం సిలబస్‌లో శ్రీమాన్ తట్టా నరసింహాచార్యులుగారు వ్రాసిన పాఠాలు ఒకటి రెండుండేవి. ఆకాలంలో ఒకసారి గుంటూరులో రెండు మూడురోజులు ఓరియంటల్ కాన్ఫరెన్స్ ఏర్పాటు చేశారు. నేను శ్రీనాథుని భోజనప్రియత్వం మీఁద వ్యాసం చదివి సమర్పించాను. ఆ సందర్భంగా వచ్చిన తట్టా నరసింహాచార్యులుగారితో పరిచయమేర్పడింది. ఏ పండితుని పాఠాలు నేను తరగతిలో బోధిస్తున్నానో ఆ పండితుణ్ణి కలిసి సంభాషించటం నాకు చాలా ఆనందం కలిగించింది. అక్కడ ఏర్పాటు చేసిన పుస్తకవిక్రయ కేంద్రంలో తట్టా నరసింహాచార్యులు గారు తెలుఁగు టీకా తాత్పర్యాలు వ్రాసిన భోజరాజుగారి చంపూరామాయణంలోని బాల, అయోధ్యా కాండల పుస్తకాన్ని కొన్నాను. ఆ పుస్తకంలో ముందు 34 శ్లోకాలు కలిగిన భోజరాజుగారి వాగ్దేవీస్తుతి ఉంది. ఆ వాగ్దేవీస్తుతి తెలుఁగునేలకు వచ్చిన వైనాన్ని ఆచార్యులుగారే యిలా నాకు వివరించారు –

నాయనా! నరసింహారావ్! నేను కాళిదాసోత్సవాలకు లోగడ ఉజ్జయినీ వెళ్లాను. అక్కడ కొంతమంది పండితులు ఈ వాగ్దేవీస్తుతిని పఠించటం చూశాను. వారి నడిగి ఆ స్తుతి తీసుకుని నేను కూడా చదివాను. భోజరాజు గారి పరమాద్భుతభావాలు భావించి పులకించాను. వచ్చేటప్పుడు ఆ స్తుతి శ్లోకాలు వ్రాసుకుని ఆంధ్రదేశానికి తెచ్చాను. ఈనాఁటికి ఈ చంపూరామాయణభాగంలో ముందువైపు చేర్చి అచ్చురూపంలోకి తెచ్చి ఆంధ్రజాతికి అందించాను. ఈ స్తుతి చాలా మహిమాన్విత మైనది. దీనిని నిరంతరం పఠించే వారికి సరస్వతీమాత కటాక్షం లభించఁగలదు సుమా!

అలా ఆచార్యులుగారు బోధించిన హితవాక్యాలు నామనస్సుకు హత్తు కున్నాయి. వారు తెలుఁగువ్యాఖ్య వ్రాసిన చంపూరామాయణభాగాన్ని రోజూ కొంత కొంత చదివేముందు వాగ్దేవీస్తుతిని చదివేవాణ్ణి. ఆ పుస్తకాన్ని పూర్తిగా చదివి పులకించిన నేను ఆ తరువాత అడపాదడపా వాగ్దేవీస్తుతిని మాత్రం చదివేవాణ్ణి. అర్థం తెలియకపోయినా స్తుతిశ్లోకాలను వేగంగా చదివే అలవాటు చేసుకున్నాను. ఆవిధంగా ఆ వాగ్దేవీస్తుతిజ్యోతి నా జీవితసౌధంలోకి వచ్చి కూర్చుంది.

**రామోరాగారి రాక :**

మా విద్యావ్యాపారం మూతపడటంతో దూరదృష్టి లేని నేను దురదృష్టానికి గుఱై ఋణార్ణవంలో ఈదులాడుతూ, కుటుంబపోషణకోసం మఱొక కాలేజీలో తక్కువ జీతానికి పనిచేస్తూ, సమాజానికీ సాహితీప్రియసమాజానికీ దూరం చేయబడి ఒంటరిగా పారాయణగ్రంథాలతో కాలం గడుపుతున్నాను. ఆ కాలంలో 2006లో ఒక మిత్రుడెవరో (పేరు, మనిషి గుర్తులేదు) శ్రీ రావి మోహనరావు (రామోరా) గారిని వెంటపెట్టుకుని మా యింటికి వచ్చాడు. పరస్పర పరిచయాలయ్యాక మోహనరావుగారు తాము అచ్చు వేయించిన కొన్ని పుస్తకాలు బహూకరించి, అచ్చువేయించబోయే పుస్తకాల వివరాలు చెప్పారు. జియాలజీ లెక్చరర్ సంస్కృతం ఎం.ఏ., చదివినందుకు ఆశ్చర్యం, సంస్కృత గ్రంథాలను ముద్రించి విద్వన్మండలికి అందిస్తున్నందుకు సంతోషం కలగలిసి నన్ను పెనవేశాయి. వారు తిరిగి వెళ్లేటప్పుడు నేను కేవలం వాగ్దేవీస్తుతి లఘుపుస్తక మిచ్చాను. అప్పటి నుంచి వారు గుంటూరు వచ్చినప్పుడు నేనందుబాటులో ఉంటే నన్ను కలవకుండా వెళ్లింది లేదు. ఆ సంవత్సరమే ఒకరోజు మా యింటికి వచ్చి వ్యాఖ్యా సహిత వాగ్దేవీస్తుతి పుస్తకాన్ని నా చేతిలో పెట్టారు. దానికి వ్యాఖ్య వ్రాసిన విద్వన్ముఖ్యులు మా గురువుగారయిన బ్రహ్మశ్రీ మేళ్లచెర్వు వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి గారు. ఆ స్తుతిరత్నానికి వ్యాఖ్యానం వ్రాయించినందుకు ఆశ్చర్యం, వ్యాఖ్యాత మా గురువుగా రయినందుకు ఆనందం కలగలిసి నన్ను పెనవేశాయి. వ్యాఖ్యానాన్ని రెండు సారులు చదివి సంతోషించాను. నేను ఇప్పగుంట సాయిబాబాగారు ఈ వ్యాఖ్యానసహిత స్తుతి పుస్తకాలను ఎందఱెందఱికో పంచి ప్రోత్సహించాము.

ఆధునిక సాంకేతిక విద్యలు నేరుస్తున్న విద్యార్థులలో చాలామంది దేవతా స్తోత్రాలను పఠించటం తప్పని భావిస్తున్నారు. తప్పని భావించటమే తప్పు. ఈ స్తోత్రాదులు కేవలం సంస్కృతాంధ్రపండితులకు సంబంధించినవనీ, నవీనవిద్యార్థు లయిన మా పిల్లలకు పనికిరావనీ చాలామంది తల్లిదండ్రులు కూడా భావిస్తున్నారు. మఱి కొందఱయితే సరస్వతీదేవికి నమస్కరిస్తారుగాని సరస్వతీశ్లోకాలు గాని, సరస్వతీ స్తుతులుగాని నేర్వటానికి, నేర్పించటానికి ఇష్టపడరు. ఇలాంటి బిడియాలన్నీ ప్రక్కనపెట్టి విద్యలు నేర్చేవారంతా శ్రీసరస్వతీదేవికి సంబంధించిన శ్లోకాలు కాని, పద్యాలు కాని, స్తుతులు కాని వారి వారి శక్తికొద్దీ మేధలో నిలుపుకోవటం మంచిదని నా అభిప్రాయం. వీలయితే నాలాగా దినచర్యను ఈ వాగ్దేవీస్తుతితో ప్రారంభించటం మరీ మంచిది. నాయీ మాటలు చదివిన తర్వాత ఏకొందఱయినా సరస్వతీ ఉపాసనామార్గంలో పయనిస్తూ లక్ష్మీకటాక్షం కోసం ప్రయత్నించి విజయం సాధిస్తే, వారు మఱికొందఱికి మార్గదర్శకులవుతారని ఆశిస్తున్నాను.

అన్నట్టు ఇంకొక్క సరస్వతీశ్లోకవిషయం ముచ్చటించటం మఱిచిపోయాను. ఆ విషయమిక్కడ చెపుతున్నాను. కొంతమంది విద్యార్థులు టీవీలలోను, వేదికలమీద ఈ క్రింది సరస్వతీశ్లోకంతో ప్రార్థన చేస్తున్నారు –

**శ్లో॥ సరస్వతి! నమస్తుభ్యం వరదే! కామరూపిణి! ।**
**విద్యారంభం కరిష్యామి సిద్ధిర్భవతు మే సదా ॥**

ఈ శ్లోకాన్ని తప్పులు లేకుండా వ్రాసినవాళ్లు, తప్పులు రాకుండా చదివినవాళ్లు చాలా తక్కువమంది కనిపిస్తున్నారు. కారణం – సరస్వతీ కామరూపిణీ అని దీర్ఘాలు తీయటమే. ఈ రెండు మాటలు సంస్కృతంలో ఈకారాంత స్త్రీలింగాలు. ఇవి సంబోధన ప్రథమావిభక్తిలో – సరస్వతి కామరూపిణి – అని హ్రస్వాలు గానే ఉండాలి. తెలుఁగులోనయితే హ్రస్వాలు దీర్ఘాలు రెండూ ఉండొచ్చు. కాబట్టి యీ శ్లోకాన్ని నేర్చేవారు, నేర్పించేవారు తప్పులు దొరలకుండా సావధానులై ఉండటం మంచిది.

**ఇక ఈ ముద్రణవిషయం :**

విద్యాదాయిని అయిన యీ వాగ్దేవీస్తుతి తొలుత మూలంతో శ్రీమాన్ తట్టా నరసింహాచార్యులుగారు ఒకసారి ముద్రించారు. నేను రెండుసారులు మూలంతోనే ముద్రించాను. శ్రీ మోహనరావుగారు వ్యాఖ్యాసహితంగా 2006లో తొలిసారి ముద్రించారు. వ్యాఖ్యాసహితంగానే వచ్చిన రెండవ ముద్రణమిది. అన్నీ కలిపితే ఇది ఐదవ ముద్రణమన్నమాట!

ఈ ముద్రణం జ్ఞానసరస్వతీపీఠం ద్వారా రావటం చాలా సంతోషకరమూ, ఔచిత్యభరితమూ అయిన విషయము. అయితే ఈ ముద్రణకు కూడా ద్రవ్యదాతలు శ్రీ రావి మోహనరావు దంపతులే కావటం మహాసంతోషకారకం. దేవభాషాప్రియులయిన ఈ దంపతులు ఇప్పటికి ఇంచుమించు 150 గ్రంథాలకు అచ్చురూపునిచ్చి తెలుఁగు రాష్ట్రాలను అచ్చెరువులో ముంచెత్తారు. తెలుఁగు జాతి గర్వరేఖను పెంచేలా ఈ దంపతులను ఆయురారోగ్యభాగ్యాలతో అనుగ్రహించాలని ఆ లక్ష్మీసరస్వతులను భక్తిమయచిత్తంతో ప్రార్థిస్తున్నాను.

**శ్లో॥ శారదా శారదామ్భోజవదనా వదనామ్బుజే ।**
**సర్వదా సర్వదాస్మాకం సన్నిధిస్సన్నిధిం క్రియాత్ ॥**
**– వాఖ్యాత చక్రవర్తి శ్రీ మల్లినాథసూరి.**

భవదీయుడు

డా॥ పుయ్యూరు లక్ష్మీనారాయణ

ది. 29–6–2016 బుధవారం,
హైదరాబాద్.

# బృహతిక

**"నిస్పందిషు ప్రథమమాత్మచయాముపాస్తాం**
**స్రష్టాపృథోమితి చ యత్పదయుగ్మ మీయాత్।**
**యా జ్యేష్ఠ రాజభజనేఽపి పురశ్చరణ్యా**
**శ్రవ్యా యయా శ్రుతి రమూం 'బృహతీం' నమామి'॥"**

**"యస్యా దయారసవశాదధునా ధునానో**
**జిహ్వాంధినోమి రసనద్వయతారతమ్యైః।**
**లక్ష్మీం చ యా దిశతి మహ్యమమూమమూకః**
**తస్యా ధినోమి హృదయం వచనాధిదేవ్యాః॥"**

ఒక చక్కని మంత్రం ఉన్నది.

**"మహో అర్ణస్సరస్వతీ**
**ప్రచేతయతి కేతునా**
**ధియో విశ్వా విరాజతి"**

జాగ్రత్తగా ఆలోచిస్తే ఈ మంత్రం సరస్వతీతత్త్వానికి దర్పణం. దీని వ్యాసరూపమే భోజరాజు చేసిన వాగ్దేవీ స్తుతి. ఈ మంత్రాన్ని కాస్త పరిశీలిద్దాం.

**మహః**=అంటే కాంతి, జ్యోతి. అది పరబ్రహ్మతత్త్వమే. ప్రకాశం పరంజ్యోతి అనేవి బ్రహ్మ వాచకాలు. **అర్ణః** అంటే నీరు. దీనిలో సరస్వతి యొక్క నదీతత్త్వము సూచింపబడింది. వర్ణశబ్దానికి సమాసంలో వకారలోపం వైకల్పికంగా ఉందని శారదాతిలక వ్యాఖ్య. మంత్రసాహిత్యంలో ఈ వాడుక బాగా ఉంది. కనుక అర్ణ=వర్ణ. అనగా అక్షరం అని అర్థం. కనుక సరస్వతి యొక్క అక్షర రూపం, నాదరూపం ఇందులో వచ్చింది. సరస్వతి అనే నామధేయం వచ్చింది. దీనితత్త్వం పీఠికలో తరువాత వస్తుంది. **'కేతువు'** అంటే నాదరూపం, ప్రణవం కావచ్చును. ప్రచేతయతి=జ్ఞానరూపం, **ధియో విశ్వాః ప్రచేతయతి** అంటే బుద్ధి ప్రేరకురాలయిన గాయత్రీ తత్త్వం సూచింపబడినది. భోజరాజు తన స్తోత్రంలో సరస్వతిని నాదమయిగా, అక్షర రూపగా, జ్యోతిస్సుగా, స్రోతస్సుగా, వెలుగుగా వర్ణించాడు. సరస్వతి యొక్క ఈ రూపాల గూర్చి ఈ పీఠికలో వివరణగా అధ్యయనం చేద్దాం.

**సంప్రదాయం :**

'ఏకం సద్విప్రా బహుధా వదంతి' అన్నది శ్రుతి. ఒకే దేవుని /దేవతను బహు రూపాలుగా తలచటం, నచ్చిన రూపాన్ని కొలవడం మన పద్ధతి. ఇన్ని రూపాలను ఏర్పరచటానికి అవకాశం సృష్టి క్రమంలో ఆయా శక్తులు పనిచేసే తీరును బట్టి

వచ్చింది. అలా పలికే శక్తి లేదా పలికించే శక్తి ఒక దేవతగా చెప్పబడింది. అదే 'వాగ్దేవి'. 'వచ్' ధాతువుకు పలికేది అని అర్థం. దీనినుంచి 'వాక్' అనే పదం వచ్చింది. అటువంటి 'దేవి' అంటే వెలుగు/శక్తి. వాగ్దేవి. శక్తులు మొదట ఒక ముద్దగా ఉన్నాయి. అదే బ్రహ్మశక్తి. తురీయ. పరబ్రహ్మమహిషి. సృష్టికోసం ఆ శక్తి ఈవలకు వచ్చింది. అదే లలిత. అదే మహాలక్ష్మి. అదే ఇచ్ఛాశక్తి. సృష్టి నాదంతో మొదలయింది. అదే జ్ఞానశక్తి. శ్యామలాదేవి. అదే మహాసరస్వతీరూపం. సృష్టి క్రియ–అదే క్రియాశక్తి. అదే మహాకాళి. వారాహి. ఈ 'మహా'పదం సముదాయ సూచకం. ఈ శక్తుల నుండి బ్రహ్మాండ పిండాండాలు అంతర్గత వివిధ శక్తులు మూర్తీభవించినవి.

**నారాయణీ–నాదరూపా :**

ఇందులో ప్రథమవ్యక్తరూపం 'నాదం'. దేవి 'నాదమయి'. దేవీ జన్యమయిన సృష్టి అంతా నాదమయం. దేవతల ఆకారాలు నాద సూచనలు కలవే. వీణ, వేణువు, డమరుకం, శంఖం, అక్షమాల, వజ్రం–ఇలా. ఈ నాదానికి అక్షరరూపం 'ఓం'. అందువలననే ఇది సర్వదేవతామయం. పరబ్రహ్మ స్వరూపమయిన శబ్దం–శబ్దబ్రహ్మం. శరీరావయవాలన్ని ప్రాణనాదమయాలు. అందువలననే దేవతామయాలు. నాదశక్తి యొక్క నాడీరూపం సుషుమ్న. శక్తిరూపం కుండలిని. నదీరూపం సరస్వతీనది. 'నది' అంటే మ్రోగేది అని అర్థం. ఇలా బ్రహ్మాండ పిండాండాల్లో పరారూపం నుంచి భౌతిక నదీరూపం దాకా పరిఢవిల్లిన నాదస్వరూపాన్ని భోజరాజు 'వాగ్దేవిగా' స్తుతించాడు. స్తుతిని చూస్తే అది కేవలం త్రిమూర్తులలోని బ్రహ్మకు భార్య అయిన 'సరస్వతి' గాక పైన ప్రతిపాదింపబడిన 'మహాసరస్వతి' యొక్క స్తుతి అని ఎవరికయినా అర్థం అవుతుంది. ఆ నాదమయీ స్వరూప స్వభావాలు వివరిస్తేనే యీ స్తుతి బాగా అర్థమవుతుందని భావించి పీఠికలో నాదమయికి వివరణ ఇస్తున్నాను.

**బిందోః తస్మాద్ భిద్య మానాద్–రవో వ్యక్తాత్మకో భవత్**
**సరవః శ్రుతి సంపన్నః–శబ్ద బ్రహ్మేతి కథ్యతే** – ప్రపంచ సారతంత్రం.

**పరాద్ బిందోః శక్త్యవస్థారూపాత్–ప్రథమస్మాత్ బిందోః అవ్యక్తాత్మా వర్ణాది**
**విశేష రహితః అఖండః నాదమాత్రం రవ– ఉత్పన్నః స ఏవ శబ్దబ్రహ్మ॥**

– శారదాతిలకమ్

వీటి సారాంశమేమనగా,

సృష్టికి పూర్వం పరమాత్మ ఒక బిందురూపం అనుకొందాం. ఆద్యంతరహితమయిన ఆకారం. ఈ బిందురూపం కూడా సృష్టివాంఛవలన ఏర్పడినది. కనుక ఇది సృష్టిశక్తి యొక్క ప్రథమదశారూపం. ఈ బిందువు నుండి అస్పష్టం అయిన ఒక 'నాదం' ఏర్పడుతుంది. అది అవ్యక్తం, అఖండం. మనలోని ప్రాణనాదం దానితో

సమానం. దీనిని 'శబ్దబ్రహ్మ' అంటారు. సర్వమంత్రాలు, సర్వశబ్దాలు, సర్వవర్ణాలు దీనిలో పుట్టి దీనిలోనే లయం అవుతాయి. ఈ నాదంలో చేరిన చైతన్యమే బ్రహ్మ. శబ్దంలో అర్థం వలె మాయలో నాదంలో బ్రహ్మ చైతన్యం ప్రతిబింబిస్తుంది. కనుక చైతన్య సహితమయిన యీ నాదం 'శబ్దబ్రహ్మ'. దీనికి పరా,పశ్యంతీ, మధ్యమా, వైఖరీ అను భేదాలు ఏర్పడినాయి. నాదం ఒక్కటే అయినా దశాభేదాల వలన నామభేదాలు. వీటికి సంబంధించిన సమగ్రవివరణ వ్యాఖ్యలో చూడవచ్చును. ఈ నాదం మన శరీరాలలోనూ ఉన్నది.

**అక్షరం పరమో నాదః శబ్దబ్రహ్మేతి కథ్యతే**
**మూలాధార గతాశక్తిః సా ధారా బిందురూపిణీ**
**తస్యాముత్పద్యతే నాదః సూక్ష్మబీజాదివాంకురః** – యోగశిఖోపనిషత్

శరీరంలో మూలాధారంలో పరానాదం ఉంటుంది. అది సాగి పశ్యంతి మధ్యమగా దిగివచ్చి వైఖరిగా అనేక విచిత్ర రూపాలతో వ్యక్తం అవుతుంది. ఈ విషయంలో నా '**లలితానందలహరి**, పద్యం' ఇచ్చట ఉదాహరించదగినది.

**నాదోత్కీర్ణ ప్రపంచామ్ అణుతరుగిరి**
**లోహాంతరవ్యక్త భావామ్**
**ఉద్భిన్నాం క్రౌంచకేకి ద్విపపిక వృష**
**భాశ్వాది తిర్యగ్గళేభ్యః।**
**సప్తస్రోతః ప్రసారాం త్రిపథగరధికాం**
**సారథిం విశ్వసృష్టేః**
**వందే వంశీ విపంచీ మునికవి మను**
**జావిష్కృతాసంఖ్య మూర్తిమ్॥**

అదే నాదం మహామునులలో మౌననిరుద్ధమై మఱల పరావాగ్రూపం తో సహస్రారంలోనికి వెళ్తుంది. ఈ పరానాదాన్ని 'పశ్యంతి' వద్ద మనం 'మహాసరస్వతి'గా భావింపవచ్చును. ఈ దశలో 'విశ్వదర్శనం' అంటే దివ్యదృష్టి కలుగుతుంది.

**తాం పశ్యంతీం విదుర్విశ్వం**
**యయా పశ్యంతి యోగినః॥** – యోగశిఖోపనిషత్

తరువాత దశ వినబడే నాదదశ. అది హృదయంలో అనాహతం లోనిది. ఇదే ప్రాణధ్వని.

**హృదయే జాయతే ఘోషః గర్జత్పర్జన్య సన్నిభః**
**తత్ర స్థితా సురేశాని మధ్యమేత్యభిధీయతే** – యోగశిఖోపనిషత్

ఆ తరువాత దశ మనందఱికి తెలిసినదే–అదే 'వైఖరీ' దశ.

**ప్రాణేన చ స్వరాఖ్యాన–ప్రథితా వైఖరీ పునః**
**వాయునా వహ్ని యుక్తేన–ప్రేర్యమాణా శనైశ్శనైః॥**

వాయు వహ్నిబలంతో స్వరరూపంగా, వర్ణరూపంగా వచ్చేది వైఖరి. ఇదంతా 'కుండలిని' స్వరూపమే. ఈ స్థితిలో గల నైపుణ్యం మనకు 'సరస్వతి'గా కనబడ్తుంది. బ్రహ్మ భార్యగాను కనబడుతుంది. మూలాధారంలో బ్రహ్మ, ఇంద్రుడు, కుండలిని, సుషుమ్న–ఇవి ఉన్నట్లు యోగశాస్త్ర ఘోష. కుండలిని నాదమయి. ఆమెయే సరస్వతి.

**కుండలిని–సరస్వతి :**

**కావ్యాది వాచో జగతాం–శ్వాసోచ్ఛ్వాస విభంజనైః**
**కూజంతీ కుండలీ శక్తిః–యయా జీవో హి ధార్యతే**
**వర్ణాత్మనావిర్భవతి–గద్యపద్యాదిభేదతః** – చక్రకౌముది

కుండలిని నాదశక్తి అని, విద్యాదేవి అని దీనివలన స్పష్టమే. ఇంకా స్పష్టంగా కుండలినియే సరస్వతి అని తేలాలంటే చూడండి.

**తస్మాత్సంచాలయేన్నిత్యం–శబ్దగర్భాం సరస్వతీం**
– యోగకుండల్యుపనిషత్

కనుక నాదం నుంచి కావ్యం దాకా సమస్త శబ్దాలు సరస్వతీ రూపాలే. పరా పశ్యంతి అనే '2' వినబడవు అజ్ఞేయములు జ్ఞానరూపాలు. మధ్యమ జ్ఞేయాజ్ఞేయం. వైఖరి స్పష్టం జ్ఞేయం జ్ఞాపిక. వైఖరిని మూస్తే మళ్లీ పై స్వరూపాలే. అన్ని రూపాలు ఆ దేవీ రూపాలే. అందువలననే సౌందర్య లహరిలో శంకర భగవత్పాదులు

**శరత్ జ్యోత్స్నా శుద్ధాం–శశియుత జటాజూటమకుటాం**

అని వాగ్దేవిని శివశక్తిగా చంద్రకళాలంకారగా వర్ణించారు. శ్రీహర్షుడు సరస్వతిని విష్ణుపత్నిగా గూడా చెప్పాడు.

**'ప్రశ్నోన్యో వాగ్ బ్రహ్మ పత్నీ ప్రసిద్ధా,– శ్రీహర్షస్తాం విష్ణుపత్నీం బ్రవీతి'**

అని 'మత్స్వప్నం'లో మా గురువుగారు శ్రీ తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రిగారు అన్నారు. ఆయా చక్రాల్లో దిగిన నాదశక్తి ఆయా చక్రాల్లోని చైతన్యమూర్తులకు 'పత్ని' అవుతుందని సమాధానం.

**సరస్వతి–బ్రాహ్మి :**

మూలాధార స్వాధిష్ఠానాలు బ్రహ్మస్థానాలు అని చెప్పవచ్చు. నాభి స్థానానికి దగ్గరగా ఉండే చక్రాలు ఇవి. నాదం నాభివద్ద నుండి వస్తున్నట్లు మనకు అనుభవమే.

**వాణీ బ్రహ్మాధిష్ఠితం యత్తదూర్ధ్వం**
**స్వాధిష్ఠానం చక్రమాస్తే షడస్రమ్॥** – మత్స్వప్నః

స్వం అంటే ప్రాణశక్తి. దానికి అధిష్ఠానం కనుక స్వాధిష్ఠానం. ప్రాణం అంటే గాలి. ఇది జల చక్రం. జలం ప్రాణానికి ముఖ్యాధారం. సరస్ అంటే జలం. సరస్వాన్ అంటే సముద్రము. సరస్వతి అంటే నది. కాగా సరస్వాన్ అంటే ప్రాణం. సరస్వతి అంటే వాక్కు.

**మాతా పుత్రౌ తు వాక్ప్రాణౌ-మాతా వాగితరస్సుతః**
**సరస్వంతమితి ప్రాణం-వాచం ప్రాహు స్సరస్వతీమ్॥** -

బృహద్దేవతా (శౌనక)

అంటే పరవస్తువు నుండి ఏర్పడిన నాదం ఆకాశ గతం. దాని తర్వాత వాయువు. నాదం నుండి వాయువు. తరువాత మన నాదాలన్నీ వాయువు నుండి పుట్టడం తెల్సిన సంగతి. శౌనకుడు వాక్కును మాతగా, ప్రాణాన్ని పుత్రునిగా, పేర్కొనటం అందుచేతనే. సరస్వాన్ ప్రాణః అన్నచో 'గాలి, జలం గలది' అని అర్థం. ఈ జలం అగ్నినుండి వచ్చినది. కాగా నాదంలోనే ముఖ్యభాగాలు '3' వచ్చినట్లు

**వాయునా వహ్ని యుక్తేన- ప్రేర్య మాణా శనైః శనైః**

- యోగశిఖోపనిషత్

**అగ్నిః వాగ్భూత్వా ముఖం ప్రావిశత్, తేజోమయీ వాక్.**
**"వాయోరగ్నిః అగ్నేరాపః"** - అని శ్రుతి

ఇట్టి జన్య జనక భావం వేదోక్తం. కనుక వాక్కుకు జలం కావాలి. అగ్ని కావాలి. వాయువు కావాలి. దీనిలోనే నాదం పుట్టుంది. స్వాధిష్ఠానం జలచక్రం. మణిపూరం అగ్నిచక్రం. మూలాధారం అగ్నికుండం. ప్రాణులకు జలం ఆధారం అని ఉపనిషత్తులు. కాగా

సరస్వాన్=ప్రాణం=ఇదే మన శరీరంలో నాదం అవుతుంది.

**నాభే రూర్ధ్వం హృది స్థానే-మారుతః ప్రాణ సంజ్ఞకః**
**నదతి బ్రహ్మరంధ్రాంతం-తేన నాదః ప్రకీర్తితః** -

హఠయోగ ప్రదీపిక

ఈ వాయువు వహ్నిగా మారి నాదంగా బ్రహ్మరంధ్రానికి చేరుతుందిట.

**"వాయుర్వహ్నీభూయ సారం తయోర్యన్**
**మూర్ధానం సన్నాద భీమం ప్రయాతి"** - మత్స్యప్న:

సన్నాదః =ఓంకార నాదం

**సరస్వతి-గణపతి :**

ఇదే గణపతి తత్త్వం అని కావ్యకంఠ గణపతి ముని అభిప్రాయ పడ్డారు.

**వైద్యుతాగ్ని రఖిలేశ్వరి పిండే- మూలతామరస పీఠనిషణ్ణః**
**ఇంద్రియం భవతి, వాగితి, దైవం-యం విదో గణపతిం కథయంతి"**

ఆకాశ స్థితమయిన అగ్ని అంటే వజ్రశక్తి, ఇంద్రశక్తి. అదే పిడుగు, ఉఱుము, మెఱుపు ఆకాశ రోదనం. ఈ వైద్యుతాగ్ని దేహంలో మూలాధార చక్రంలో చేరి వాగింద్రియంగా అంటే పరావాక్కుగా చేరింది. ఈ శక్తిని యోగులు గణపతి అంటారు. దీనికే ఋతంభర ప్రజ్ఞ అని పేరు. ప్రజ్ఞాంకురాకారమే గణపతి తుండ స్వరూప మాతృక. బ్రహ్మాండశక్తి పిండాండ రూపంలోనికి దిగిందని అర్థం.

**నాదశక్తి- రుద్రాణి :**

ఈ నాదశక్తినే రుద్రుడని చెప్తారు. రుదిర్=అశ్రువిమోచనే. అశ్రు విమోచనం వర్షమే. రోదసీ రోదనం ఇది.

**అరోదీదంతరిక్షే యత్-విద్యుద్వృష్టిం దదన్నృణామ్।**
**చతుర్భిః ఋషిభిస్తేన-రుద్ర ఇత్యభిసంజ్ఞితః॥** - బృహద్దేవతా

రోదనం=నాదం. దానివలన విద్యుత్, వృష్టి వచ్చాయి. ఉఱుము, మెఱుపులు వర్షం-ఇవి అన్యోన్య సంబంధం కలవి. దీనివలననే 'ఆకాశాద్వాయుః వాయోరగ్నిః అగ్నేరాపః" అన్న క్రమం వచ్చింది. ఈ విధంగా నాదానికి 'వాయ్వగ్నిజల' సంబంధం ఉంది. ఇది రుద్రశక్తి. రుద్రాణి, రౌద్రి. ఇదే 'ఇంద్రశక్తి' గూడా. పై శ్లోకాలలో ఆ సంగతి సూచనగా ఉన్నది.

**'ఇరాం దృణాతి యత్కాలే-మరుద్భిః సహితోంబరే**
**రవేణ మహతా యుక్తః-తేనేంద్ర మృషయోఽబ్రువన్'** - బృహద్దేవతా

వాయునాదముల సహాయంతో ఆకాశం నుండి వృష్టి సాధించటంలో ఇంద్రునికి 'ఇంద్రుడు' అని పేరు వచ్చింది. ఇర=అంటే నీరు.

ఇలా చూస్తే సర్వప్రపంచం నాద విలాసం అని తెలుస్తుంది. నాదశక్తి వైవిధ్యమే దేవతా వైవిధ్యము. అందువలననే భోజరాజు తన సరస్వతిని పరాశక్తిగా, నాదమయిగా సృష్టికర్త్రిగా, మూలశక్తిగా, వాక్కుగా, కావ్యకళగా చిత్రించాడు.

**ప్రణవనాదం-సరస్వతి :**

ఈ నాదము 'ప్రణవం' అని చెప్పబడింది. కుండలినియే నాదరూపం అని చెప్పబడింది. 'ఓం' అనేది బ్రహ్మ ప్రణవము. 'ఉమ' అనేది దేవీప్రణవం. అంటే సృష్టి శక్తిగా దిగి వచ్చిన నాదం తనలోని అక్షరాలను సృష్టి పదార్థాలను విడదీసుకొని ప్రదర్శిస్తుంది. సృష్టినుండి లయమునకు పోవునపుడు అన్నీ తనలో కలిపికొని పోతుంది.

**ఉమేతి పరమా శక్తిః-పూర్వభావముపేయుషీ**
**అర్థ్యష్ట వలయాకారా-ప్రణవత్వముపాగతా"** - రుద్రయామళం

పరమశక్తి ఉమ. ఆమె తన పూర్వస్థితిని పొందదలచినపుడు వలయాకారంగా చుట్టలు (3 1/2) చుట్టుకొని 'ఓం'గా మారుతుంది.

'ఓం–ఉమ' అనేవి బ్రహ్మకు నాదశక్తికి సంకేతాలు. అ+ఉ+మ్+ ఇందులో అకారము పరమేశ్వర సంకేతము. దీనిని సృష్టిలోనికి తెచ్చింది ఉమ్+అ=ఉమ.

మఱల దీనిని సృష్టి నుండి వెనుకకు తీసుకువెళ్తే 'అ+ఉమ్' 'ఓం' కలసిపోయిన స్థితి. 'అ'లో 'ఉమ్' కలసిపోయిన స్థితి. దేవిది 'ఉమ' రూపం. పరమాత్మది 'ఓం' రూపం. దేవతలకు శబ్దమయమయిన రూపం ఉంటుంది. అదే మంత్రరూపం.

**'దేవ్యాః త్రీణి రూపాణి. కరచరణాదివిశిష్టం స్థూలం మంత్రమయం సూక్ష్మం వాసనామయం పరం'** – సౌభాగ్యభాస్కరమ్.

కనుక 'ప్రణవము' వాగ్దేవికి రూపాంతరము. ఆమె ఉమయే.

**గాయత్రి–సరస్వతి :**

గాయత్రియే సరస్వతి. సరస్వతియే గాయత్రి.

**'గాయత్రీ వా ఇదం సర్వం, సర్వం భూతం యదిదం కించ, వాగ్వై గాయత్రీ'**
– శ్రుతి

సమస్త ప్రపంచం గాయత్రి అట. గాయత్రి అంటే నాదమయి అనుకుంటే ప్రపంచ సృష్టికి నాదం ప్రారంభకం కనుక ఆ మాట సరిపోతుంది. ప్రతి వాక్కు గాయత్రి అట. ఇదీ పై పద్ధతిలోనే సరిపోతుంది. కనుక నాదమంతా సరస్వతీ రూపమే.

**వాక్–ఐం :**

ఈ వాక్ స్వరూపాన్ని 'ఐం' బీజ పరంగా వర్ణించాడు త్రిపురా మహిమ్న స్తోత్ర కర్త దూర్వాస మహాముని.

**'వందే వాగ్భవ మైంద వాత్మ సదృశం–వేదాది విద్యాగిరః**
**భాషా దేశ సముద్భవాః పశుగతాః–ఛందాంసి సప్తస్వరాన్**
**తాలాన్యంబ మహాధ్వనీన్ ప్రకటయ–త్యాత్మప్రసారేణ యత్**
**తద్బీజం పదవాక్యమానజనకం–శ్రీమాతృకే తే పరమ్॥**

ఈ వాక్స్వరూపాన్నే జ్యోతిర్మయంగాను త్రిలోక నిలయంగాను చెప్పాడు ఆయన.

**'స్వాంతే మే స్ఫురతు త్రిలోకనిలయం–జ్యోతిర్మయం వాఙ్మయమ్'**
– త్రిపురా మహిమ్న స్తోత్రం

త్రిలోక నిలయం అంటే సృష్టి మూలనాదశక్తిగానే నిరూపించినట్లు భావించాలి. అది గాయత్రియే. దానిలోని 3 వ్యాహృతులు 3 ఖండములు '3' లోకాలకు గుర్తు.

దాని వర్ణములు 24 తత్త్వాలకు గుర్తు. అది సృష్టి కర్త యొక్క నాదశక్తికి సంకేతం గదా!

**సరస్వతి-హంస -అజప :**

బ్రహ్మ పత్ని అయిన సరస్వతికి 'హంస' వాహనం అట! ఈ హంస కూడా ప్రాణమే. ప్రాణ నాదమే. ఈ హంస విషయం భోజరాజు చెప్పలేదు. వీణ మొదలయిన స్వరూప వర్ణన అతడు చేయలేదు.

**'హంస హంస' వదేద్వాక్యం-ప్రాణినాం దేహ మాశ్రితః,**
**సప్రాణాపానయోః గ్రంథిః-అజపేత్యభిధీయతే"**

- బ్రహ్మ విద్యోపనిషత్

మన ఉచ్ఛ్వాసనిశ్వాసాల వలన వచ్చే నాదమే 'సోహం' అని ఆరోపణ చేయబడింది. 'హ' అనేది ప్రాణానికి గుర్తు. ప్రాణ=అనగా 'ప్ర+అన" అని వ్యుత్పత్తి. చక్కని శ్వాస. పీల్చే శ్వాస అని అర్థం.

'అప+అన' అపాన=వదలే శ్వాస.

**'హంసః ప్రాణాశ్రయోనిత్యం-ప్రాణాపానపదాశ్రయః'**

కనుక శ్వాస దానివలన వచ్చిన నాదమే హంస. లేదా శ్వాసయే హంస. నాదమే దేవత. దేవత-వాహనం ఒకటేనా? అని ప్రశ్న. ఒక్కటేనంటున్నాయి ప్రమాణ గ్రంథాలు. మనకు మన కాళ్ళు రథం. మనలోని జీవునకు మన శరీరమే రథం. అలానే దేవతకు తన తేజస్సే తన రథం ఆయుధం మొ॥ అన్ని.

**'తేజస్త్వే వాయుధం ప్రాహుః-వాహనం చైవ యస్య తు'** - బృహద్దేవతా

'నిరుక్తం'లో ఇదే విషయం ఇంకా స్పష్టంగా ఉంది.

**'ఆత్మా ఏవ ఏషాం రథోభవతి-ఆత్మా అశ్వః ఆత్మా ఆయుధం'** - నిరుక్తం.

అందువలన 'సరస్వతి-హంస' అన్ని నాదమయీ భేదములే.

**సరస్వతి-నది :**

ఈ సరస్వతి ఒక దేవత. ఒక నది. గంగాదేవి యిందులో ఈమెకు పోలిక. వేదంలో సరస్వతికి నదిగా, ప్రస్తావన ఉన్నది.

**'సరస్వతీతి ద్వివిధం-దిక్షు సర్వాసు సంస్తుతా**
**నదీవద్దేవతా వచ్చ-తత్రాచార్యస్తు శౌనకః'** - బృహద్దేవతా

ఈ నదినే వాగ్దేవతగా చెప్పినట్లు సాక్ష్యం గూడా ఉన్నది.

**'సరాంసి ఘృతవంత్యస్య-సంతి లోకేషు యత్రిషు**
**సరస్వంత మితి ప్రాణం-వాచం ప్రాహుః సరస్వతీమ్'** - బృహద్దేవతా

సరస్వతీనది 'వాక్కు' అని చెప్పాడు. 'సరస్వాన్' అంటే ప్రాణం అని చెప్పాడు. ఇంతే గాక

**'అంబితమే నదితమే సరస్వతి'** అన్న సరస్వతీ మంత్రం గూడా సరస్వతికి నదీ రూపాన్ని అంగీకరిస్తున్నది.

సరస్వతి గురించి, మనవారి అవగాహన ఇది. చైతన్య దశాభేదాల లోని చదువుల తల్లిని గూడా మనం 'సరస్వతి' గా ఆరాధిస్తున్నాం. బహు దేవతారాధన మనకు సహజం. ఏకేశ్వరోపాసకులు అయిన పాశ్చాత్యులు గూడా సరస్వతీ ప్రార్థన చేయడం గమనింపదగిన విషయం.

**సరస్వతి-Muse :**

ఆంగ్లమహాకవి మిల్టన్ తన 'పారడైజ్ లాస్ట్'లో తొలిపుటలలో Muse అనే పేరుగల తమ చదువుల తల్లిని అచ్చంగా మన భావాలతోనే ప్రస్తుతించాడు.

ఆ విషయాలను పరిశీలిద్దాం.

1) వారి సరస్వతి మన ఆకాశవాణిలాగా వారి ప్రవక్త అయిన 'మోషే'కు ప్రపంచ సృష్టి క్రమం తెలిపిందట.

'Who first taught to chosen seed
In the begining how Heaven
And Earth rose out of Chaos '

2) మన సరస్వతి వీణావాదిని గాయకురాలు. వారి సరస్వతి గూడా గాయకురాలే. అందుకే కవి Sing Heavenly Muse అంటాడు.

3) వీరి సరస్వతికి కూడా ఒక నదితో సంబంధం ఉంది.
Siloa's brook that flowed - Fast the oracle of God.

4) సరస్వతి సర్వహృదయ నివాసిని. వారి సరస్వతి అటువంటిదే.

"O Spirit! that dost prefer - Before all temples the upright
Heart and Pure"

5) తన కవితను బలంగా కొనసాగేటట్లు దీవించమని కోరతాడు. అంటే వారి సరస్వతి గూడా 'కావ్యకల' అని స్పష్టం.

"I thence invoke thy aid to my Adventurous song"

6) సరస్వతి అనుగ్రహంతో ఏమి జరుగుతుందో, తనకు ఏమి జరగాలో కోరాడు. అది గూడా అచ్చం మన సరస్వతీ మహిమ వంటిదే.

"Instruct me for thou Knowest - Thou from the first vast
Present and with mighty - winds out spread Dove-like
Sat it brooding on the vast Abyss"

సరస్వతి 'ఆదిశక్తి' అని 'సర్వవ్యాపిని' అని సర్వరక్షిణి అని విజ్ఞానఖని అని

చెప్పాడు.

7) రామాయణ రచనలో వాల్మీకికి రామచరిత్రలోని గుహ్యాగుహ్య విషయాలన్నీ స్పష్టంగా తెలుస్తాయని బ్రహ్మ దీవిస్తాడు. అదే విధంగా ఈ కవి గూడా ప్రార్థిస్తున్నాడు.

"And Mad'st it. Pregnant - What is in me in dark-illumine,
what is low, rise and support - That to the height of your
Great argument"

తనలోని అజ్ఞానాన్ని తొలగించి జ్ఞానాన్ని వెలిగించే కావ్యకల అని ప్రార్థించాడు. యుక్తియుక్తమయిన జ్ఞానాన్ని ఇవ్వమంటాడు. "Wise men think alike" అంటే ఇటువంటిదే గదా! గ్రీకు పురాణం ప్రకారం వారి దేవునికి 9మంది ఆడపిల్లలు. వారు కవితకు, సంగీతానికి నృత్యానికి, చరిత్రకు, ఇతర కళారూపాలకు అధిపతులు. Muse అంటే Poets' genius అని అర్థం. అంటే 'ప్రతిభ, ప్రజ్ఞ' అని అర్థాలు. Muse అనే క్రియకు think deeply అని అర్థం. అంటే ఆలోచనా శక్తి అని అర్థం. మన సరస్వతికి కూడా ఈ పేర్లు ఈ మహిమలు ఉన్నాయి. కాకపోతే అన్ని కళలకు ఈమె అధిపతి. వారికి భిన్నంగా 9మంది. కాని అందఱికి పేరు ఒక్కటే. Muse, The Muses. మనం పైన చూచిన ఈ తత్త్వాలన్ని భోజరాజు కూడా వర్ణించినవే. అందుకే ఈ పీఠిక.

ఈ విధంగా సర్వలోకారాధ్య అయిన ఆ తల్లిని క్రింది శ్లోకాలతో స్మరించి ఇక 'కచ్ఛపి'ని చేపట్టుదాం.

*"వరమర్థయితుంచ యాం శ్రయేరన్*
*వచనాయేతరదేవసాధకాశ్చ।*
*స్వరవాగ్గతవృత్రకుంభకర్ణే*
*సదయా మే భవ దేవి! తే సుతోహమ్॥"*

*"అస్మాకమధరస్పందో యయౌ సార్థకతాం యయా।*
*పరం బ్రహ్మ కవీభూతం తాం వందే మనసః శ్రియమ్॥"*

**చోదన**

భోజరాజు రచించిన వాగ్దేవీస్తుతికి మురిసి ముచ్చటపడి నాకందించిన డా॥ పుయ్యూరు లక్ష్మీనరసింహారావుగారికి, నా కోరిక మేర కచ్ఛపీ నామమున సమ్మోహనముగా ఆంధ్రవ్యాఖ్యనందించిన శ్రీ మేళ్ళచెర్వు గారికి నమస్సుమాంజలులు.

– రామోరా

శ్రీః

# వాగ్దేవీస్తుతిః

## కచ్ఛపీ వ్యాఖ్యా

శ్లో॥ *యదేకమక్షరమజం–న నశ్యతి న జాయతే,*
*శబ్దబ్రహ్మైకసర్వస్వం–వాగ్జ్యోతిః తదుపాస్మహే॥* 1

**ప్రతిపదార్థము :** యత్=ఏది, ఏకమ్=అఖండమో, అక్షరమ్=అనంతమో, అజమ్=అనాదియో, న నశ్యతి=నశింపదో, న జాయతే=పుట్టదో, శబ్దబ్రహ్మ= నాద బ్రహ్మయొక్క, ఏకసర్వస్వమ్=సమస్త మూలధనమో, తత్=ఆ, వాగ్= 'వాక్కు' అనే, జ్యోతిః=వెలుగును, ఉపాస్మహే=సేవించెదము.

**తాత్పర్యము :** భోజమహాకవి ఇందులో సాధారణ సరస్వతిగా మనం భావించే చదువుల తల్లిని మాత్రమే కాక, సర్వసృష్టినిదానమయిన 'నాదమయి' మహా సరస్వతి, మహాలక్ష్మి అయిన బ్రాహ్మిని ప్రస్తుతిస్తున్నాడు. శబ్దబ్రహ్మకు కూడా మూలకారణమయిన 'వాగ్జ్యోతి'ని ఆరాధించుచున్నాడు. ఆ జ్యోతి పరబ్రహ్మకు భిన్నం కాదు.

'స్త్రీహి బ్రహ్మ బభూవిథ' అని వేదం చెప్పినట్లు స్త్రీ రూపపరబ్రహ్మను ప్రస్తావించాడు. కనుకనే అది అక్షరం–క్షరించనిది. అంతం లేనిది. అది అజం–పుట్టుక లేనిది. శాశ్వతం. ఆద్యంతరహితం. దిక్కాలాది విభాగం గాని జననమరణాలు గాని లేనిది. ప్రపంచసృష్టి మూలమయిన శబ్దబ్రహ్మకు గూడా అది మూలమయినది. అటువంటి వాగ్జ్యోతిని ఉపాసించెదము గాక! అన్నాడు భోజుడు.

**విశేషములు :**

1) **యా వేదాంతార్థతత్త్వైకస్వరూపా పరమార్థతః**
**నామరూపాత్మనా వ్యక్తా సా మాం పాతు సరస్వతీ॥**
– సరస్వతీ రహస్యోపనిషత్

2) **యా సాంగోపాంగవేదేషు చతుర్ష్వేకైవ గీయతే**
**అద్వైతా బ్రహ్మణః శక్తిః సా మాం పాతు సరస్వతీ॥** – (స–ర–ఉ)

ఈ సరస్వతీరహస్య గ్రంథంలో గూడా సరస్వతీతత్త్వం వేదాంత సారమయిన

'బ్రహ్మస్వరూపం'గానే కనబడుతోంది. భగవంతుని 'స్వాభావికీ జ్ఞానబలక్రియాచ' అని చెప్పబడిన శక్తి సరస్వతి అని భావించవచ్చును. మన తెలివి మన సరస్వతి. భగవంతుని తెలివి 'మహాసరస్వతి' కనుక 'బ్రహ్మణః శక్తిః'–అంటే 'బ్రాహ్మీ'దేవి–అంటే 'జ్ఞానశక్తి'

2) ఈ 'శబ్దబ్రహ్మ' వలన పరబ్రహ్మను చేరే అవకాశం ఉందని శాస్త్రవాక్యం.

**'శబ్దబ్రహ్మణి నిష్ణాతః–పరంబ్రహ్మాధిగచ్ఛతి'** – త్రిపురాతాపిని.

కనుక బ్రాహ్మి వలన మనం బ్రహ్మభావం చెందగలం.

3) 'శబ్దబ్రహ్మ' అంటే 'నాదం' అని అర్థం. అంటే ఉత్త 'మ్రోత'. అది జడం. అది చేతనమయిన బ్రహ్మం ఎలా అవుతుంది? అదే అంటారు పద్మపాదాచార్యులు.

**'యది శబ్దార్థః శబ్దో వా శబ్దబ్రహ్మ ఇత్యుచ్యతే తదా బ్రహ్మపద వాచ్యత్వం నోపపద్యతే. యతః సచ్చిదానందరూపో బ్రహ్మపదార్థః, తౌచ జడౌ'**

– ప్రపంచసారవ్యాఖ్య

సందర్భం ఏమంటే వ్యాకరణశాస్త్రం ప్రకారం అర్థబోధక శబ్దం లేదా వాక్యస్ఫోటం శబ్దబ్రహ్మ.

**"కేచిదాచార్యాః శబ్దార్థం ఆంతరస్ఫోటం**
**శబ్దబ్రహ్మ ఇత్యాహుః... అపరే వైయాకరణాః**
**వాక్యస్ఫోటలక్షణం శబ్దం అఖండైకార్థప్రకాశకం**
**శబ్దబ్రహ్మేతి వదంతి"**

కనుక ఈ వ్యాకరణ మతం ప్రకారం జడమయిన శబ్దార్థము లేదా వాక్యార్థము బ్రహ్మమని అపార్థం వచ్చింది. దీనిని ఖండిస్తూ పద్మపాదులవారు పై మాట అన్నారు.

ఈ విషయంలో "శారదాతిలకం" చెప్పిన మాట చూద్దాం.

**"చైతన్యం సర్వభూతానాం శబ్దబ్రహ్మేతి మేమతం**
**తత్ప్రాప్య కుండలీరూపం ప్రాణినాం దేహమధ్యగమ్**
**వర్ణాత్మనావిర్భవతి గద్యపద్యాదిభేదతః"** –శారదాతిలక వ్యాఖ్యా

**"పరాద్ బిందోః శక్త్యవస్థారూపాత్ ప్రథమస్మాత్**
**బిందోః అవ్యక్తాత్మా వర్ణాది విశేషరహితః**
**అఖండః నాదమాత్రం రవ ఉత్పన్నః స ఏవ శబ్దబ్రహ్మ"**

మన శరీరంలో 'నాదం' ఉంది. అది మన చైతన్యం నుంచి వస్తుంది. చైతన్యసహితమయిన ఈ నాదమే "శబ్దబ్రహ్మ". ఇది అఖండ స్వరూపం. దీని వ్యక్తరూపాలయిన ఖండరూపాలు వైఖరిగా ప్రపంచంలో ఉన్నాయి. అవి పదవాక్య కావ్యాది రూపాలలో ఉన్నాయి. ఇవి శబ్దబ్రహ్మలు కావు. వీని ఉపాసన వలన బ్రహ్మత్వం సిద్ధించదు. కనుకనే

**"న హి న హి రక్షతి డుకృఞ్ కరణే"**

తత్వం ఏమంటే; శబ్దంగాని, అర్థంగాని, వాక్యంగాని, వాక్యార్థం గాని రావాలన్నా, అర్థం కావాలన్నా, ప్రయోజనం ఉండాలన్నా "చైతన్యం" తప్పనిసరి. శక్తి – ఉపాసన వద్ద గూడా "శక్తి శక్తిమతోరభేదః" అన్నట్లు శక్తిమంతుని ఉపాసనే తప్ప జడమయిన శక్తి మాత్రం కాదన్నదే ఉపాసనా రహస్యం. కనుకనే "కౌలోత్తర సంహిత"లో

**"మాయాధిష్ఠానచైతన్యముపాస్యత్వేన కీర్తితం,**
**మాయాశక్త్యాదిశబ్దశ్చ విశిష్టస్యైవ లక్షణా"** అన్నది.

కనుకనే ప్రపంచసారంలో

**"శబ్దబ్రహ్మేతి శబ్దావగమ్యమర్థం విదుర్బుధాః**
**స్వతోర్థానవబోధత్వాత్ ప్రోక్తో నైతాదృశో రవః"**
అన్నారు. దీని భావం వారే వివరించారు.

"శబ్దోచ్ఛారణ కాలే తత్సాక్షితయా ఆంతరత్వేన అవగమ్య మర్థం బిందాత్మకం బిందాత్మక ప్రకాశాత్మత్వం వినా అనవబోధకత్వాత్ తత్ప్రోక్తః రవః న శబ్ద బ్రహ్మ"

కనుక శబ్దంలో వ్యాపించిన బ్రహ్మమే "శబ్దబ్రహ్మ". అదే ఆది సరస్వతి. అదే పరానాదం, పరాశక్తి, మహాసరస్వతి.

4) బ్రహ్మాండ పురాణంలో అశ్వతరుడు చేసిన సరస్వతీ స్తుతిలోనూ ఇదే విషయం ఉన్నది.

**"త్వమక్షరం పదం దేవి యత్ర సర్వం ప్రతిష్ఠితమ్**
**అక్షరం పరమం బ్రహ్మ విశ్వం చైతత్పరాత్పరమ్"**

**శ్లో॥** *వాచం వాణీం గిరం భాషాం-భారతీం గాం సరస్వతీమ్।*
*బ్రాహ్మీం వర్ణాత్మికాం దేవీం-వన్దే ప్రణవమాతరమ్॥* **2**

**ప్రతిపదార్థము :** వాచమ్=వాగ్రూప, వాణీమ్=శబ్దరూప, గిరమ్=ఉచ్చారణ రూప, జ్ఞానరూప, భాషామ్=వ్యక్తవాక్కు, భారతీమ్=భరతముని సంబంధ మయినది, గాం=కిరణరూపమయినది, అగ్నిరూపమయినది, సరస్వతీమ్= సరస మయినది, వ్యాప్తి చెందునది, బ్రాహ్మీమ్=వేద సంబంధమయినది, బ్రహ్మ సంబంధ మయినది, పరారూపమయినది, వర్ణాత్మికామ్=అక్షర స్వరూప మయినది, 4 రకాల రంగులు మరియు జాతులు గలది అయిన, ప్రణవ మాతరమ్= ఓంకారజనని అయిన, దేవీమ్=నాదమయి అయిన దివ్యశక్తిని, వందే= నమస్కరించెదను, స్తుతించెదను.

**భావము :** సరస్వతికి బహురూపాలు కలవు. బహునామాలు కలవు. శ్రద్ధ, మేధ, ప్రజ్ఞ, ధారణ, వాక్, మహాసరస్వతి మొ॥ సరస్వతీ భేదాలు కలవు. ఈ విషయాలు

సరస్వతీ రహస్యోపనిషత్తులో చూడవచ్చును. 4 రకాల రంగులు, 4 రకాల జాతులు గల వర్ణమాతృకలను పూజించడం సంప్రదాయంలో ఉన్నది కనుక వర్ణాత్మిక.

ఆ విధంగా సాధారణ వాక్కుగాను, అవ్యక్త నాదాలుగాను, సార్ధకమయిన రకరకాల భాషలుగాను, నాట్యసంబంధమయిన సంగీతాది సారస్వతంగానూ జ్ఞానాగ్ని స్వరూపంగాను, సరసమయిన కావ్యాది వాఙ్మయం గాను, వేదమాతగాను, అక్షరరూప ఖండశరీరగాను ఓంకార జననిగాను ఉన్న నాదశక్తికి నమస్కారము.

**విశేషములు :**

1) **"యా వర్ణ పద వాక్యార్థస్వరూపేణైవ వర్తతే**
**అనాదినిధనా చాంబా సా మాం పాతు సరస్వతీ"** – సరస్వతీ రహస్యోపనిషత్

దేవీ స్వరూపం అఖండం, సర్వవ్యాపి. అయినను మన సౌకర్యం కొఱకు ఏకమయిన ప్రపంచాన్ని చెట్టుగా, పుట్టగా వింగడించినట్లు, ఏకమయిన మన దేహాన్ని కాళ్ళు, చేతులు మొ॥ అవయవాలుగా విభజించినట్లు అఖండమయిన "నాదమయి"ని మన సౌకర్యార్థం అక్షరాలుగా, పదాలుగా, వాక్యాలుగా, శ్లోకాలుగా, కావ్యాలుగా, శాస్త్రాలుగా – ఇంకా అనేక విధాలుగా విడదీస్తాం. అట్టి సర్వఖండములందు వ్యాపించినది అఖండ నాదస్వరూపమే అన్న తత్వం ఈ శ్లోకంలో చెప్పిన విశేషం.

2) "ఓంకారం, శబ్దబ్రహ్మ. దానికి గూడా నాదమయి అయిన శక్తి "మాత". నాదము శక్తి. అదిలేనిదే అక్షరస్వరూపమయిన ఓంకారం గూడా రాదు. కనుక సరస్వతి ప్రణవమాత. పైగా ప్రణవం 'సోహం' నుంచి ఏర్పడిన అక్షరము. 'సోహం' శ్వాసవలన ఏర్పడినది. శ్వాసగూడా నాదం వలన ఏర్పడినదే. ఈ జన్యజనక భావం "1"వ శ్లోకవ్యాఖ్యలో చెప్పాము.

3) 1) వచ–పరిభాషణే=రకరకాల భాషలు
2) గౄ–నిగరణే, శబ్దే, విజ్ఞానే – అని 3 రకాలు.
3) భాష – వ్యక్తాయాంవాచి
4) భారతీ – భరతసంబంధమయిన వాక్కు, నాట్యగానాదికం
5) భృా – అతచ్–ఉణాది=భరించేది–భారతి
6) గౌః=గచ్ఛతి, గై–శబ్దే,
7) సరస్వతీ=సృ–గతౌ–రసికహృదయగామిని, నది
8) బ్రహ్మ–బృహ–భాషార్థే, బృహ–వృద్ధౌ, బృహిర్ శబ్దే

బృహతీ=వాక్కు, బృహస్పతి=వాక్పతి ఈ విషయాలను బట్టి పై శ్లోకానుసంధానం చేయడం బాగుంటుంది.

శ్లో॥ *సదప్యసదిదం విశ్వం-యదనుప్రాణితం వినా।*
*తదేకమిన్దువిశదం-జ్యోతిః సారస్వతం స్తుమః॥* **3**

**ప్రతిపదార్థము :** యత్=ఏ నాదశక్తి యొక్క, ఏ వాగ్దేవి యొక్క, అనుప్రాణితం వినా=సహకారం లేకుండా, ఇదమ్=ఈ విశ్వం, ప్రపంచము, సదపి= ఉన్నదయినను, అసత్=లేనిదే అగునో, తత్=ఆ, ఇందు=చంద్రునివలె, విశదమ్=తెల్లని, ఏకమ్=అఖండమయిన, సారస్వతమ్=సరస్వతీ సంబంధ మయిన, జ్యోతిః=వెలుగును, స్తుమః=కొనియాడెదము.

**భావము :** వెన్నెల వలె అత్యంత నిర్మలమయిన యీ సారస్వత జ్యోతివలననే విశ్వానికి అస్తిత్వము. ఈ వెలుగు లేనిదే విశ్వం ఉన్నా లేనట్టే. అట్టి సారస్వత జ్యోతిని స్తుతించెదము.

**విశేషములు :**

**ఇదమంధంతమఃకృత్స్నం-జాయేత భువనత్రయమ్।**
**యది శబ్దాహ్వయం జ్యోతిః-ఆసంసారం న దీప్యతే॥**

అన్న ప్రసిద్ధ శ్లోకం గూడా ఇదే తాత్పర్యాన్ని చెపుతుంది. శబ్దజ్యోతి అంటే నాదం. దానినుంచి ఓంకారం దాని నుండి వేదసారస్వతం అటనుండి లౌకిక వాఙ్మయం దాకా ఆవిర్భవించినాయి. ఈ వాఙ్మయం వలననే మనం సర్వలోక విషయాలు తెలిసికొంటున్నాం. ఆఖరుకు బ్రహ్మ పదార్థం గురించి గూడా తెలుసుకొంటున్నాం. కనుక వేదాదుల వలన మనకు అనేక ప్రయోజనాలు, జ్ఞానం కలుగుతాయి. కనుకనే **"చోదయిత్రీ సూనృతానాం చేతంతీ సుమతీనాం, యజ్ఞం దధే సరస్వతీ"** అని - సరస్వతీ రహస్యోపనిషత్తు చెప్పింది. అంతేగాక

"సత్" అంటే ఓంకారము. సత్ అంటే బ్రహ్మం.

**"సదోంకారో నిగద్యతే"** - శారదాతిలక వ్యాఖ్య

**"ఏకం సద్విప్రా బహుధా వదంతి"** - శ్రుతి

అట్టి 'బ్రహ్మం' గూడా ఈ నాదశక్తి వలననే "అస్తిత్వం" పొందిందని చమత్కారం.

2) ఈ నాదశక్తి ఆ భగవంతుని కల. ఆత్మకల. భవభూతి గూడా సరస్వతిని

**"వందే మహి చ తాం వాణీ-మమృతా మాత్మనః కలామ్"**

అని "ఆత్మకల"గా చెప్పాడు.

అట్టి పరమాత్మ కల వలననే ఆ పరమాత్మ, ఆయన సృష్టి అయిన ప్రపంచం అందటికి అనుభవంలోనికి వస్తుంది.

"తస్య భాసా సర్వమిదం విభాతి" అని గదా శ్రుతి. ఇంతకూ ఈ కాంతి ఎవరు ? 'పరమాత్మ' రూపమే. ఆ విషయం పీఠికలో చూడవలసినది.

*శ్లో॥ యయా వ్యాప్తమిదం విశ్వం-యాం వినైతన్న భాసతే।*
*యా చ సర్వమిదం దేవీ-వాగ్దేవీం తాముపాస్మహే॥* 4

**ప్రతిపదార్థము :** ఇదమ్=ఈ, విశ్వం=ప్రపంచము, యయా=ఏ దేవత చేత, వ్యాప్తమ్=వ్యాపించబడినదో, యాం వినా=ఏ దేవత లేకుండా, ఏతత్=ఈ ప్రపంచము, న భాసతే=ప్రకాశింపదో, ఇదమ్=ఈ దృశ్యమానమయిన, సర్వంచ=సమస్త ప్రపంచమున్ను, యా దేవీ=ఏ దేవత యొక్క స్వరూపవెూ, తామ్=ఆ, వాగ్దేవీమ్=వాగ్దేవతను, ఉపాస్మహే=సేవించెదము.

**భావము :** దేవి నాదమయి. సర్వసృష్టి నాదబిందు కళామయం. నాదం మూల పదార్థము. ఆకాశం నాదగుణకం. సృష్టి అచ్చటనుంచి వరసగా దిగి వచ్చింది. ప్రాణం నాదం. కనుక ప్రపంచమంతా ఆమెరూపం. ఆమె వ్యాప్తిలేనిచోటు లేదు. ఆమె లేనిదే ప్రపంచము లేదు. అట్టి నాదాత్మిక అయిన వాగ్దేవిని ఉపాసించెదము.

**విశేషములు :**

1) **"అంతర్యామ్యాత్మనా విశ్వం త్రైలోక్యం యా నియచ్ఛతి**
**రుద్రాదిత్యాది రూపస్థా యస్యామావేశ్య తాన్ పునః**
**ధ్యాయంతి సర్వరూపైకా సా మాం పాతు సరస్వతీ"** – సరస్వతీ రహస్యోపనిషత్

అంటే రుద్రుడు, ఆదిత్యుడు, ఇంద్రుడు మొ॥ రూపాలలో ఉండి ఏ దేవత ఈ విశ్వాన్ని అంతర్యామిగా ఉండి నడిపిస్తున్నదో, ఆమెయందే ఈ రుద్రాదిత్యాదులను ఆవాహన చేసి సమస్త స్వరూపగా ఏ దేవతను మనం ధ్యానించెదమో ఆ సరస్వతి రక్షించునుగాక – అని సరస్వతీ రహస్యం చెప్తున్నది. "ఏకం సద్విప్రా బహుధా వదంతి" – అన్నట్లు 'సరస్వతి' పేరుతో బ్రహ్మనే "స్త్రీ హి బ్రహ్మ బభూవిధ" అన్నట్లు ధ్యానించి స్తుతించటమే ఇది.

2) కనుకనే బృహద్దేవతలో "శౌనక మహర్షి" ఇంద్రుణ్ణే బృహస్పతి గాను, బ్రహ్మణస్పతిగాను, వాచస్పతిగాను చెప్పడం జరిగింది.

బృహస్పతి అంటే మామూలు అర్థం వాక్పతి. బృహతీ=వాక్కు, ఛందస్సు అని అర్థం. అలాగాక

**"బృహంతౌ పాతి యల్లోకౌ ఏష ద్వౌ మధ్యమోత్తమౌ**
**బృహతా కర్మణా తేన బృహస్పతిరితీరితః"** అన్నాడు శౌనకముని.

బృహత్కర్మతో బృహల్లోకములయిన భూస్వర్గలోకములను లేదా ద్యావాపృథివులను లేదా అంతరిక్ష స్వర్గలోకములను, లేదా భువస్సువర్లోకము లను పరిపాలిస్తాడు కనుక 'బృహస్పతి' అట. "బృహత్" అంటే నాదం (వాక్కు) అనుకొంటే

'నాదమయి'ని గూర్చి గూడా యీ శ్లోకం చెప్పినట్లే. ఈ తరువాత శ్లోకంలో 'బ్రహ్మ' అనే పదానికి (బృహత్–కు రూపాంతరమే గదా) అలాంటి అర్థం చెప్పాడు శౌనకుడు.

**"బ్రహ్మ వాక్ బ్రహ్మ సత్యంచ–బ్రహ్మ సర్వమిదం జగత్**
**పాతారం బ్రహ్మణస్తేన–శౌనహోత్రః స్తువన్ జగౌ"** – బృహద్దేవతా

బ్రహ్మ (బృహతి) అంటే వాక్కు అట, సత్యం అట. ఈ ప్రపంచం అట. ఈ మొత్తాన్ని రక్షిస్తాడు కనుక ఇంద్రుడు 'బ్రహ్మణస్పతి' అట. మరో విషయం గుర్తించాలి. ఈ ఇంద్రుడు మనం అనుకొనే పురాణ ప్రసిద్ధ ఇంద్రుడు గాడు. పరమాత్మయే. అట్లే 'వాచస్పతి' పదనిరుక్తి చేస్తూ శౌనకుడు –

**వాచా వేదాహ్యధీయంతే–వాచా ఛందాంసి తత్ర హ।**
**అథో వాక్ సర్వమేవేదం–తేన వాచస్పతిః స్మృతః॥**

అని 'వాక్కు' గొప్పతనం చెప్పాడు. కాగా వాక్కులేనిదే వేదాలు లేవు. వేదాలు లేనిదే ఈ ప్రపంచం, దేవతలు, కర్మలు, కర్తలు, క్రియలు లేవు. ఇవి లేనిదే ప్రపంచం లేదు. కనుక భోజరాజు చెప్పిన 'సరస్వతీరూప' బ్రహ్మ – అదే – బ్రాహ్మిని ఉపాసించాలి. తేడా అల్లా 'స్త్రీ'గా చెప్పటమే.

3) సర్వం భరించేదిగా చెప్పాడు గనుక ఇందులో "భారతీ" నామం వ్యాఖ్యాతం అయింది.

**ఓంకారాక్షర సంస్థానం యత్ర దేవి చరాచరమ్ ।**
**తత్ర మాత్రాత్రయే సర్వమస్తి యద్దేవి నాస్తి యత్ ॥**

– దత్తాత్రేయ మాహాత్మ్యంలో అశ్వతరుని సరస్వతీ స్తోత్రం

ఇందులోను ఓంకార రూప సరస్వతియందు చరాచరం సమస్తం కొలువుదీరినట్లు చెప్పబడింది. అవి ఎలా ఉన్నాయో గూడా అక్కడే ఉన్నది.

**"దారుణ్యవస్థితో వహ్నిః భౌమాశ్చ పరమాణవః**
**యథా త్వయి స్థితం బ్రహ్మ జగచ్చేద మశేషతః"** – దత్తాత్రేయ మాహాత్మ్యంలో

చెక్కలో నిప్పు, పార్థివ పరమాణువులు కల్సియున్నట్లు సరస్వతిలో బ్రహ్మము, జగత్తు ఉన్నాయట అందువలన భారతి.

**శ్లో॥ *శబ్దోల్లేఖం వినా సర్వే–ప్యర్థా నార్థత్వమాప్నుయుః।***
***తద్వ్యక్తి హేతుం తామేకాం–స్తుమశ్శబ్దాధిదేవతామ్ ॥*** **5**

**ప్రతిపదార్థము :** శబ్ద=శబ్దము యొక్క, ఉల్లేఖం వినా=ఉదాహరణ లేకుండగా, అర్థాః =విషయములు, సర్వేపి=అన్నియును, అర్థత్వమ్=విషయత్వమును, నాప్నుయుః =పొందవు. తత్=ఆ శబ్దముల యొక్క, అర్థముల యొక్క, వ్యక్తి=వ్యక్తమగుటకు,

హేతుమ్=కారణమయిన, తామ్=ఆ, ఏకామ్=ఒక్కతె అయిన, శబ్దాధిదేవతామ్=శబ్దదేవతను, స్తుమః=స్తుతించెదము.

**తాత్పర్యము :** శబ్దములు, నాదములు లేకుండా ఏ అర్థము అయినను అర్థంగా భాసించదు. శబ్దములకు, అర్థములకు గూడా వ్యక్తం కావటానికి హేతువయిన వాగ్దేవిని స్తుతించెదము.

**విశేషములు :**

1) "కొబ్బరికాయ" అనే శబ్దం లేకపోతే "ఆ వస్తువు" మనకు భాసించదు. ఒక మూగవాడు కొబ్బరికాయను గూర్చి మనకు చెప్పాలన్నా మనం వానికి చెప్పాలన్నా ఎంత అవస్థ పడతామో తలచుకొంటే విషయాలు అర్థాలుగా భాసించటానికి 'శబ్దం' ఎంత అవసరమో తెలుస్తుంది.

2) సంస్కృతంలోని విషయం తెలుగులో చెప్పాలంటే మనం "ప్రతిపదార్థం" చెప్తాం. అంటే నిజానికి "అర్థం" అనేది చెప్పేది కాదు. ఒక పదానికి మరొక భాషాపదమే చెప్తాం. 'ప్రతిపదార్థం' అంటే అంతే. ఈ పదం వలన మనమనస్సులో విషయం అనే 'అర్థం' స్ఫురిస్తుంది. 'అశ్వః=గుఱ్ఱం' అని అర్థం చెప్తాం. కాని అది 'అర్థం' కాదు. కేవలం మఱొక భాషాపదం మాత్రమే. కాని ఈ శబ్దం వలన మన మనస్సులో 'అర్థం' అంటే 'గుఱ్ఱం' అనే జంతువు ప్రత్యక్షం అవుతుంది. కనుక దానిని 'ప్రతిపదార్థం' అని పిలుస్తాం. ఈ అర్థాలు లేదా ప్రతిపదార్థాలు అన్ని శబ్దమును బట్టి సాగేవి. అట్టి 'శబ్దం' వ్రాయాలంటే అక్షరరూపం కావాలి. అదే 'ఉల్లేఖం' అని గూడా అనవచ్చును. 'వర్ణాత్మిక' అయిన శబ్దదేవత సరస్వతిని ఇందులో భోజుడు స్తుతించాడు.

శ్లో॥ *దీప్యతే యన్న నిర్వాతి-స్వయం యచ్చ ప్రకాశతే।*
*ప్రకాశకం చ విశ్వస్య-జ్యోతిస్సారస్వతం స్తుమః॥* **6**

**ప్రతిపదార్థము :** యత్=ఏ జ్యోతి, దీప్యతే=ప్రకాశించుచుండునో, న నిర్వాతి= ఆరిపోదో, యత్=ఏది, స్వయమ్=తనంతతానుగానే, ప్రకాశతే చ= ప్రకాశిం చునో, విశ్వస్య చ=ప్రపంచమునకున్ను, ప్రకాశకమ్=ప్రకాశం కలిగించేదో, సారస్వతమ్=ఆ సరస్వతీ సంబంధమయిన, జ్యోతిః=వెలుగును, స్తుమః=స్తుతించెదము.

**తాత్పర్యము :** సారస్వత జ్యోతి ఆరదు. వెలుగుచునే ఉండును. అది ఇతరుల సహాయం లేకుండగానే వెలుగును. అంతేకాదు ప్రపంచాన్ని అంతటిని వెలిగించును అట్టి "చదువుల వెలుగుకు" నమస్కారము.

**విశేషములు :**

1) విద్యాధనం గుఱించి భర్తృహరి చెప్పిన విషయాలకు ఈ వర్ణన పోలికగా

ఉంది. విద్యాజ్యోతి ఒక్కసారి వెలిగితే ఇక ఆరదు. అది స్వయం ప్రకాశమానమై ఇతర విషయాలను మనకు అర్థంఅయ్యేలాగా చేస్తుంది.

2) అంతేగాక శబ్దబ్రహ్మ, వాగ్జ్యోతి అనుకొన్నచో అది 'ఓంకారం'గా చెప్పవచ్చును. 2వ పద్యంలో చెప్పిన విషయం ఇచ్చట జోడించాలి. అందులో 'గాం' ప్రణవమాతరం అన్నాడు. అందులోని "ప్రణవము" సమస్త సృష్టికి పరాత్పరునకు సంకేతము. అది వేదాది విద్యలకు, మంత్రతంత్రాలకు మంగళకరమయిన ఆదిమవర్ణం. 'వేదాంతం'లో గూడా అదే అంతిమ వర్ణం.

**యో వేదాదౌ స్వరః ప్రోక్తః- వేదాంతే చ ప్రతిష్ఠితః** అని గదా ఆర్యోక్తి.
**సర్వేషామేవ మంత్రాణాం-కారణం ప్రణవః స్మృతః।** - వృద్ధ హారీతస్మృతి

ఓంకారము, శక్తి బ్రహ్మస్వరూపానికి సంకేతం. అందుకే గాయత్రికి ముందు వ్యాహృతులు ఓంకారంతో కల్సి యుంటాయి. వీటితోనే ప్రాణాయామం చేస్తాం. "ఓం భూః, ఓం భువః - మొ॥

**సప్తవ్యాహృతిషు ప్రోక్తః ప్రణవో యః పునఃపునః**
**సప్తానామపి లోకానాం శక్తిబ్రహ్మస్వరూపతా** - వృద్ధ హారీతస్మృతి

3) గాం=కిరణ స్వరూపం అనుకుంటే సర్వత్ర ప్రకాశించే జ్ఞానకళ, చైతన్య రేఖ, కాంతి వలయం, పరాశక్తి కనుక అది 'ఆరని జ్యోతి' పరంజ్యోతి.

**"త్వం చంద్రికా శశిని తిగ్మరుచౌ రుచిస్త్వం**
**త్వం చేతనాసి పురుషే యవనే బలం త్వం**
**త్వం స్వాదుతాసి సలిలే శుచిని త్వమూష్మా**
**నిస్సారమేతదఖిలం త్వదృతే యది స్యాత్"**

ఈ విధంగా సర్వలోక దీపకమయిన 'ఆ' "జ్యోతి"కి నమస్కారము.

***శ్లో॥ యద్దీప్యమానమనిశం-న వాసరమపేక్షతే।***
***విలక్షణం నస్తజ్జ్యోతిః-పాయాత్సారస్వతం సదా॥*** **7**

**ప్రతిపదార్థము :** అనిశమ్=నిత్యము, దీప్యమానమ్=వెలుగునట్టి, యత్=ఏ జ్యోతి, వాసరమ్=పగటిని, న+అపేక్షతే=కోరదో, విలక్షణమ్=ఇతర దీప విలక్షణ మయిన, తత్=ఆ, సారస్వతమ్=సరస్వతీ సంబంధమయిన, జ్యోతిః=వెలుగు, నః=మనలను, సదా=ఎల్లప్పుడు, పాయాత్=రక్షించుగాక !

**భావము :** రేయింబవలు తేడాలేకుండా వెలిగే వెలుగు అది. ఆ వెలుగునకు వెలగటానికి "పగలు" అవసరం లేదు. అట్టి విపరీత శక్తిగల సారస్వత జ్యోతి మనలను నిత్యం రక్షించుగాక !

**విశేషములు :**

సాధారణ దీపాలు లేదా చంద్రుడు వెలుగులు చిమ్మటానికి "రాత్రి" అవసరం. సూర్యుడు వెలగటానికి పగలు అవసరం. కాని సారస్వత జ్యోతి కాలాపేక్ష లేనిది. నిత్యం వెలుగుతుంది. పై వెలుగులలో రాత్రిపూట ఒకరకం, పగటిపూట మఱొకరకం రక్షిస్తుంటాయి. కాని యీ జ్యోతి సర్వదా రక్షించగలది. ఇదే చైతన్యకళ, జ్ఞానకళ, విద్యాకళ, వాక్కళ.

ఇందులో ఈ జ్యోతి ఇతర సూర్యచంద్రాగ్నులకన్న శక్తిమంతమయిన జ్యోతి అని వ్యతిరేకాలంకార ధ్వని. కాని "విలక్షణం" అనే పదం వలన వాచ్యం అయింది. కనుక గుణీభూత వ్యంగ్య వ్యతిరేకాలంకారముగా మాఱినది.

**శ్లో॥ *ప్రథమః పరమ బ్రహ్మ-వివర్తో యస్తదాత్మికామ్***
***తాం బోధరూపాం జగతో-భారతీం సతతం స్తుమః*** **8**

**ప్రతిపదార్థము :** పరమబ్రహ్మ=పరబ్రహ్మ యొక్క, ప్రథమః=మొదటి, వివర్తః=మార్పు, యః=ఏదో, తదాత్మికామ్=ఆ వివర్త స్వరూపురాలయినదియు, జగతః=ప్రపంచము యొక్క, బోధరూపామ్=జ్ఞానస్వరూపురాలయినదియు అగు, తామ్=ఆ, భారతీమ్=వాగ్దేవిని, సతతమ్=నిత్యము, స్తుమః=స్తుతించెదము.

**భావము :** నిశ్చల పరబ్రహ్మయొక్క ప్రథమ స్పందరూపమయిన ప్రపంచ జ్ఞాన శక్తి అయిన ఆ భారతికి వందనములు.

**విశేషములు :**

1) **"శివేచ్ఛయా పరా శక్తిః శివతత్త్వైకతాం గతా।**
**తతః పరిస్ఫురత్యాదౌ సర్గే తైలం తిలాదివ ॥** - వాయవీయ సంహిత

శక్తి-శక్తిమంతుడయిన పరమేశ్వరుడు అభిన్నంగానే ఉంటారు. అయితే సృష్టివాంఛ కలిగినంతనే శక్తి స్పందిస్తుంది. నువ్వుగింజలో నూనె ఏకీకృతంగా ఉంటుంది. తైలవాంఛగలిగినంతనే పిండడం ద్వారా బయట పడుతుంది. ఈ శక్తి స్పందము "నాద రూపం"గా ఉంటుంది.

"Shakhi Thrills as Nada" - Serpent Power

2) ఈ శక్తి-ఉన్మీలనం జరిగిన వెంటనే ప్రపంచం ఉన్మీలితం అవుతుంది. రీలు తెఱవగానే సినిమా మొదలయినట్లు. అదే అంటారు అభినవగుప్తులు.

**"యదున్మీలనశక్త్యైవ విశ్వమున్మీలతి క్షణాత్**
**స్వాత్మాయతన విశ్రాంతాం తాం వందే ప్రతిభాం శివామ్"**

సృష్టికి సిద్ధపడిన నాదశక్తి ఘనీభవించి బిందురూపం దాల్చింది. పాలుగట్టిపడి

పెరుగయినట్లుగా దీనిని చెప్పవచ్చును. ఈ బిందువు నుండి '3' భాగాలు వచ్చినవి. బీజ–నాద–బిందువులు.

4) నాదాలు '2' రకాలు. సృష్టిమూలమయిన నాదశక్తి ప్రథమస్పందము. తర్వాత సృష్టిలో ఏర్పడిన నాదం ద్వితీయనాదం. ప్రథమనాదం పరాపశ్యంతీ స్వరూపమయిన నాదము.

**"బిందోః తస్మాద్ భిద్యమానాత్–రవోవ్యక్తాత్మకో భవత్।**
**స రవః శ్రుతి సంపన్నః–శబ్దబ్రహ్మేతి కథ్యతే"॥** – ప్రపంచ సారతంత్రం

ఇది అవ్యక్తనాదం. ప్రణవంలోని 'మకారం' తరువాత వచ్చే అనురణన ధ్వనివంటి నాదం ఇది. ఇది శబ్ద బ్రహ్మ. ఇది పశ్యంతి.

బిందువు అంటే ఈశ్వరుడు. ప్రకృతి పురుష సమాహారం. దీనినుంచి '2' లక్షణాలు కల నాదం వచ్చింది. 'పరా, పశ్యంతి' అనేవి ఆ 2 లక్షణాలు.

**పరా పశ్యంత్యాత్మకః రవః అభవత్**
**స ఏవ చ కుండల్యాది శబ్దైరభిలప్యతే॥** – పద్మపాద వ్యాఖ్య

ఈ శక్తియొక్క స్థానం లలాటమధ్యం
**నాదరూపా పరాశక్తిః లలాటస్య తు మధ్యమే** – సూత సంహిత

ఈ అర్ధనారీశ్వరమయిన నాదశక్తికి "హ"కారం ఒక సంకేతం.

"హకారం నుంచి అకారందాకా క్రిందనుంచి పైకి లయక్రమంలో ప్రత్యాహారం చేస్తే 'హ' వస్తుంది.

**''హకారో హి అకార హకారాత్మా. ప్రత్యాహారగ్రహణన్యాయేన గృహీతేతరవర్ణయోః నాదాకారరూపేణ, బుద్ధిప్రాణరూపేణ, జ్ఞానక్రియా శక్తి రూపేణ, ప్రకాశవిమర్శరూపేణ, చిదానందరూపేణ వా, సర్వవర్ణాద్యనుగమాత్ పరా వాగాత్మత్వేన సర్వాత్మత్వాత్ ప్రకృతిపురుషకాలాత్మకత్వం నిత్యత్వం చావగంతవ్యం – పద్మపాద వ్యాఖ్య**
– ప్రపంచసారతంత్రమ్

పద్మపాద తాత్పర్యం ఏమంటే – అకారహకారములు ప్రత్యాహార పద్ధతిలో "హ" అయినవి. ఇందులో "అకారము" శివ సంకేతము.

**"అకారః సర్వవర్ణాగ్ర్యః–ప్రకాశః పరమః శివః"** – సంకేత పద్ధతి

హకారము గాలికి, శ్వాసకు, నాదానికి, ప్రాణానికి గుర్తు. నాదం ప్రకృతి. కనుక 'హ్+అ' = హ అన్నది అర్ధనారీశ్వర బీజం. ఇంకొక విశేషం ఏమంటే, హకార మధ్యం బిందువు. క్రిందిభాగం యోని ఆకారం. కనుక శివశక్తి సంకేతం.

కనుక 'హకారము' బుద్ధిప్రాణాలకు, జ్ఞానక్రియలకు, ప్రకాశ విమర్శలకు, జ్ఞాన–ఆనందములకు సంకేతము. అదే పరావాక్కు. అది ప్రకృతి పురుషకాలాలకు సంకేతం. శ్రీ పద్మపాదుని యీ ఆశయాలే భోజసరస్వతికి తత్త్వసంకేతం అవుతాయి.

6) అక్షరాలలో 'హకారం' వలె బీజాక్షరాలలో 'ఏం' గూడా సంకేతం. "అ+ఈ=ఏ.

అ=శివుడు, ఈ=శక్తి; అనగా 'అ' యొక్క స్త్రీ అనే అర్థంలో "ఙీష్" వస్తే అ=ఈ అవుతుంది. కనుక ఏ గూడా శివశక్తి మిథున ప్రతీక. అంతేకాక అ=బ్రహ్మం. దీనినుండి వచ్చిన నాదం కనుక "అ+ఇ" కలిస్తే "ఏ" అవుతుంది. సంయోగవర్ణం. దీనికిగూడా యోని బీజం అని పేరు 'ం'.

**"శివశక్తి సమాయోగస్యైవ జగద్బీజత్వాత్**
**తదభేదేన తాదృశాక్షరస్యాపి తద్బీజత్వమ్"**

అన్నారు పద్మపాదాచార్యులు. ఈ శివశక్తి మిథునాన్ని భోజరాజు నాదశక్తిగా, వాగ్దేవిగా, సరస్వతిగా చెప్పాడు.

"ఏకం సద్విప్రా బహుధా వదంతి"

7) దేహంలో గూడా ఈ నాదం గురించి భాగవతం వివరించింది.

**సమాహితాత్మనో బ్రహ్మన్–బ్రహ్మణః పరమేష్ఠినః।**
**హృదాకాశాదభూన్నాదః–వృత్తిరోధాద్విభావ్యతే॥**
**యతోఽభూత్ త్రివృదోంకారః–యో వ్యక్తప్రభవః స్వరాట్"**– భాగవతం–12

బ్రహ్మసమాధిలీనుడయినపుడు ఆయన హృదయాకాశంలో 'నాదం' ఆవిర్భవించింది. మనం మనస్సును ఆపి ఆలకించితే ఆనాదం వినవచ్చును. ఈ నాదమునుండే ఓంకారం వచ్చింది. ఈనాదం అవ్యక్తం. స్వయంప్రకాశం అట. దీని విషయంలో శ్రీధరాచార్యులవారు వ్యాఖ్యలో వ్రాసిన విషయాలు గమనించతగినవి.

**"యః కర్ణపుటపిధానేన శ్రోత్రప్రవృత్తి**
**నిరోధాత్ అస్మదాదిష్వపి విభావ్యతే తద్వత్"**

చెవులు మూసి వింటే మనలో గూడా యీ నాదం వినిపిస్తుందట. అంటే మనలోనే ఉన్న నాదమే సరస్వతి అని నిశ్చయం.

8) ఈ నాదమే మనలో 'ప్రణవం'గా వినబడుతుందని శాస్త్రవాక్యం.

**"కేవల కుంభకావస్థాయాం ఊర్ధ్వాధో వృత్తి**
**మత్ప్రాణాపానయోః ఐక్యం కృత్వా అథ**
**దీర్ఘఘంటానాదవత్ అనాహతా**
**ఖ్యః హృదయే ప్రణవధ్వని రుదేతి"** – మహావాక్య రత్నావళి

కనుక పరబ్రహ్మ నుంచి బ్రహ్మదాకా బ్రహ్మనుంచి మనదాకా ప్రాణనాద స్వరూపంతో ఉండే కుండలినీ శక్తియే "సరస్వతి" అని స్పష్టం.

9) ఆ మహాశక్తి అక్షరరూపం గూడా మనలోనే ఉన్నదని త్రిపురా మహిమ్న స్తోత్రంలో ఉన్నది.

**"ఆదిక్షాంతసమస్తవర్ణ-సుమణిప్రోతే వితానప్రభే"**

అనే పద్యం వద్ద నా వ్యాఖ్యానం చూడవచ్చును. ఈ గ్రంథం **"సాధన గ్రంథమండలి" - తెనాలి** వద్ద దొరకును.

శ్లో॥ *సితాంశువిశదచ్ఛాయాం-నిర్భరానన్దవాహినీమ్।*
*వన్దే మోహతమస్తోమ-చన్ద్రలేఖాం సరస్వతీమ్॥* **9**

**ప్రతిపదార్థము :** సితాంశు=చంద్రునివలె, విశద=తెల్లని, ఛాయామ్=కాంతి గలదియు, నిర్భర=పూర్ణమయిన, ఆనందవాహినీమ్=ఆనందనదియు, మోహ=అజ్ఞానమనే, తమస్తోమ=చీకటికి, చంద్రలేఖామ్=చంద్రరేఖ అయిన, సరస్వతీమ్=సరస్వతిని, వందే=స్తుతించెదను.

**భావము :** చంద్రధవళ, శారద చంద్ర చంద్రికాడంబరచారుమూర్తి, ఆనంద మందాకిని, అజ్ఞాన తిమిరధ్వంసన చంద్రరేఖ అయిన సరస్వతికి నమస్కారము.

శ్లో॥ *స్తుమస్తాం యత్కృపాలేశ-కల్పద్రుమలతా నృణామ్।*
*శ్రోత్రశుక్తిపుటాస్వాద్యం-సూతే కిమపి వాఙ్మధు॥* **10**

**ప్రతిపదార్థము :** యత్=ఏదేవి యొక్క, కృపాలేశ=స్వల్పదయ అనెడు, కల్పద్రుమ లతా=కల్పలత, నృణామ్=మనుష్యులకు, శ్రోత్ర=చెవులనెడి, శుక్తిపుట= దొప్పలతో, ఆస్వాద్యమ్=రుచిచూడదగిన, కిమపి=ఒకానొక, వాఙ్మధు=వచన మకరందమును, సూతే = కలిగించునో, తామ్ = ఆ వాగ్దేవిని, స్తుమః = స్తుతించెదము.

**భావము :** ఏ దేవి దయాలేశం వలన మనుష్యులకు మధురమయిన భాషామృతము ఆవిర్భవించునో ఆ దేవికి నమస్కారము.

**విశేషములు :**

1) మనుష్యులకు కర్ణపేయమయిన భాష అంటే వైఖరీ వాక్కు. అది కోకిలగానం, చిలుక పలుకులు, సంగీతము, కవిత్వము మొ॥ కావచ్చును. ఏవయినా వాగ్దేవి దయాభిక్షలే.

2) "వాచా వదామి మధుమత్" అని అథర్వవేదం చెప్పినట్లు కమ్మగా మాట్లాడే శక్తి గూడా వాగ్దేవి కరుణవలన వస్తుంది.

3) ఇంగ్లీషులో దీనినే "Tell it - with roses" అంటారు. ఎంత కటువయిన విషయమయినా మధురంగా నవ్వుతూ చెప్తే బాగుంటుందని అర్థం. "సత్యం బ్రూయాత్ ప్రియం బ్రూయాత్" అని గూడా ఆర్యోక్తి.

4) **"మధు మధురం తస్మాచ్చ సుధా", తస్యాః కవేర్వచః"** అన్నట్లు

నచ్చినవారికి కావ్యం మధురమధుధార కదా ! అట్టి కావ్యకల దేవి వలన రావలసినదే.

**"సరస్వత్యే వైషా ఘటయతి-యథేష్టం భగవతీ"** అన్నారు గదా ఆనంద వర్ధనులు.

5) ఒక్క ఆభాణకం ఉన్నది. అది యీ సందర్భంలో చెప్పదగింది.

ఒకసారి సభలో భవభూతి కాళిదాసుల కవిత్వాల మధ్య నాణ్యత పరీక్ష జరిగిందట. '2' కవిత్వాలను త్రాసులో పెట్టి తూచారట. అందులో భవభూతి కవిత్వం తేలిపోతున్నదట. భవభూతి మీద సానుభూతితో శారదాదేవి తన కర్ణావతంసమయిన కమలమకరందాన్ని కాస్త భవభూతి కవిత్వంలో రాల్చిందట. దాంతో భవభూతి కవిత్వం కాస్త మొగ్గు పెరిగిందట. ఆది చూచిన కాళిదాసు వెంటనే ఆశువుగా ఈ పద్యం చదివాడట !

**"అహో ! మే సౌభాగ్యం మమ చ భవభూతేశ్చ రచితం**
**ధటాయామారోప్య ప్రతిఫలతి తస్యాం లఘిమని**
**గిరాందేవీ సద్యః శ్రుతికలిత కహ్లార కలికా**
**మధూళీ మాధుర్యం క్షిపతి పరిపూర్త్యై భగవతీ"**

ఇలా అన్న కాళిదాసు మాటను బట్టిచూస్తే "కవితా మాధుర్యం" సరస్వతీ కృపవలన సిద్ధిస్తుందని అది తనకు సహజసిద్ధమయినదని, అదే కృప భవభూతికి తత్కాల సంభూతమని తెలుస్తున్నది. కనుకనే ఆచార్య శంకరులు గూడా అన్నారు.

**"కథం నత్వా నత్వా కిమివ హి సతాం సన్నిదధతే**
**మధుక్షీరద్రాక్షామధురిమధురీణాః ఫణితయః"** – సౌందర్యలహరి

శ్లో॥ ***యదలక్ష్యమతిస్పష్ట-మవాచ్యం వాచ్యమేవ యత్***
***జ్ఞేయాజ్ఞేయస్వరూపం-తత్ జ్యోతిః సారస్వతం స్తుమః"*** **11**

**ప్రతిపదార్థము :** యత్=ఏ జ్యోతి, అలక్ష్యమ్=లక్షింప సాధ్యముగానిది, లక్షణావృత్తి వేద్యముగానిది, అతిస్పష్టమ్=మిక్కిలి స్పష్టమయినదియు, అవాచ్యమ్=ఇట్టిది అని చెప్పరానివైభవముగలదియు, అభిధావృత్తితో తెలియనిదియు, వాచ్యమేవ= చెప్పదగినదియు, అభిధావృత్తితో చెప్పదగినదియు అగునో, యత్=ఏ జ్యోతి, జ్ఞేయ= తెలిసికొనదగిన, అజ్ఞేయ=తెలిసికొనశక్యము గాని, స్వరూపమ్= స్వరూపముగలదో, తత్=ఆ, సారస్వతమ్=వాగ్దేవతాసంబంధమయిన, జ్యోతిః=వెలుగును, స్తుమః=స్తుతించెదము.

**భావము :** వాగ్దేవతాజ్యోతి '2' రకాలు. అది జ్ఞేయం – అంటే జ్ఞాతుం అర్హం. అజ్ఞేయం=జ్ఞాతుం అశక్యం. అలక్ష్యం కొన్ని స్వరూపాలు అతిస్పష్టం. కొన్ని ప్రభావాలు మనం వర్ణించలేనివి. కొన్ని మనం వర్ణించగలవి. అర్హార్థ శక్యార్థాలను దృష్టిలో పెట్టుకొని ఈ శ్లోకంలో విరోధ తత్పరిహారాలు ధ్వనిస్తాయి. అట్టి వాగ్జ్యోతిని స్తుతించెదము.

**విశేషములు :**

1) శబ్దదేవిని మనం కేవల శబ్దంగాగాక అర్థసహిత శబ్దంగా, కేవల జడశక్తిగాగాక చైతన్యసహిత శక్తిగా స్తుతిస్తున్నాము. ఇందులో ప్రత్యక్ష రూపం శబ్దం. అప్రత్యక్ష రూపం అర్థం. ఏ శబ్దానికయినా అర్థం అనేది మనకు తెలిసిందే 'ఖాయం' అనటానికి లేదు. వేద, కావ్యాల విషయంలో ఈ విషయం అనుభవసిద్ధం. కనుక శబ్దార్థాల విషయంలో ఈ శ్లోక విషయాలు సహజంగా వర్తిస్తాయి.

2) ఇక శబ్దపరంగా తీసుకొన్నపుడు శబ్దం లక్షణలో ఉంటే అర్థం లక్ష్యం, వ్యంజనలో ఉంటే అర్థం అవాచ్యం, అభిధలో ఉంటే వాచ్యం, స్పష్టం అవుతుంది. ఈ సందర్భాలలో స్పష్టం జ్ఞేయం అవుతుంది. అస్పష్టం అజ్ఞేయం అవుతుంది. ఇదిగాక బహుశ్రోతృ వ్యంగ్యస్థలాలలో ఒక్కరికి వాచ్యం మఱికొంత మందికి భిన్న భిన్న వ్యంగ్యాలు ఉద్దేశింపబడతాయి.

**"కస్య వా న భవతి రోషః–దృష్ట్వా ప్రియాయాః సవ్రణమధరం,**
**సభ్రమర పద్మాఘ్రాయిని–వారితవామే సహ స్వేదానీమ్"**

ఇలాంటి శ్లోకాలలో/కావ్యాలలో నాదమయి జ్ఞేయాజ్ఞేయంగానే ఉంటుంది. శ్రీహర్షనైషధం అట్టి 'జ్ఞేయాజ్ఞేయం' కదా !

3) ఇక యోగశాస్త్రపరంగా తీసుకొంటే 'వ్యక్తవాక్కు, అవ్యక్తవాక్కు' ఉన్నాయి. వ్యక్తవాక్యంలో గూడా పశుపక్ష్యాదుల వాక్కులు అలక్ష్యం, అవాచ్యం గానే ఉంటాయి. ఇక అవ్యక్తవాక్కు అంటే 'నాదం'. అది 4 రూపాలు దాల్చింది.

**చత్వారి వాక్పరిమితా పదాని–తాని విదుః బ్రాహ్మణా యే మనీషిణః।**
**గుహా త్రీణి నిహితా నేంగయంతి–తురీయం వాచో మనుష్యా వదంతి॥** –శ్రుతి

పదాలు 4 రకాలు. వాటిని వివరంగా ఎరిగినవారే విద్వాంసులు. అందులో '3' రకాలు రహస్యంగా గుహలో (సుషుమ్నలో/దహరంలో) ఉంటాయి. 4వ రకం మనుష్యుల ఉచ్చారణలో కనబడుతుంది.

ఇందులో అత్యంత అలక్ష్యం–పరావాక్కు. అతిస్పష్టం అయినది 'వైఖరీ వాక్కు'. అవాచ్యం అయినది పశ్యంతి. వాచ్యం అయినది మధ్యమ. జ్ఞేయాజ్ఞేయ స్వరూపము అయినది మొత్తం అంతా "వాక్కు".

**"నిష్పందా పరా వాక్-సస్పందాః పశ్యంత్యాద్యాః"** - పద్మపాద వ్యాఖ్య

అసలు స్పందం లేనిది పరావాక్. పరబ్రహ్మలో శక్తిగా ఉండేది. ప్రథమ స్పందంగా సృష్టివాంఛతో కదిలేది - పశ్యంతి. ఇదే ప్రకృతి.

వీటి వివరణలు చూద్దాం.

ఎ) **తత్త్వసంజ్ఞా-పరావాక్-నిష్పందా పరావాక్** - పద్మపాదవ్యాఖ్య

తిలల్లో వున్న తైలంవంటిది, పాలలోని వెన్నవంటిది అయిన అవిభక్త స్థితి పరావాక్.

బి) **తదర్థరూపిణీ ప్రకృతి తత్వాంతం-పశ్యంతీ**
**తత్ర సామాన్యస్పంద ప్రకాశరూపిణీ నాదతత్త్వాత్మికా**
**అధ్యాత్మ మూలాధారాది నాభ్యంతం**
**అభివ్యజ్యమానా పశ్యంతీ**
**సామాన్యజ్ఞానాత్మకత్వాత్ పశ్యంతీ"** -పద్మపాదవ్యాఖ్య

**"ప్రాజ్యం ప్రోల్లాసమాత్రం యత్-భేదేనాసూత్ర్యతే యయా**
**వందేఽభినవగుప్తోఽహం-పశ్యంతీం తామిదం జగత్"** - అభినవగుప్తః

ఈ మొత్తాన్ని బట్టి తేలిందేమనగా వాక్సంబంధమయిన సృష్టి సంబంధమయిన ప్రథమ స్పందం పశ్యంతి. దీనిలో ఏదో ఒక మాట మాట్లాడాలనే జ్ఞానం, సృష్టి చేయాలనే జ్ఞానం ఉంటాయి కనుక దీనిలో "దర్శనం" ఏర్పడింది. కనుక "పశ్యంతి" ఇది. గట్టిపడుతున్న పాల వంటిది. లేదా బిందువుపడిన పాలవంటిది. దీనిలో కొద్దిపాటి 'భేదం' గోచరిస్తుందని అభినవ గుప్తులు, ఆలోచనాసముద్రం అయిన పరావాక్కులో ఒక మాట గురించి చెప్పాలనే ఆలోచన పశ్యంతి.

సి) **అథ బాహ్యాంతఃకరణాద్యాత్మికా**
**హిరణ్యగర్భ రూపిణీ బిందుతత్త్వమయీ**
**నాభ్యాదిహృదయాంతాభివ్యక్తి స్థానా**
**విశేషస్పందసంఖ్యాది పతితత్వాత్ మధ్యమా**
**"మధ్యే మా=బుద్ధిః యస్యాః సా మధ్యమా** -పద్మపాదవ్యాఖ్య

**"ఆసూత్రితానాం భేదానాం-స్ఫుటతాపత్తిదాయినీం**
**త్రిలోచనప్రియాం వందే-మధ్యమాం పరమేశ్వరీమ్"** - అభినవగుప్తులు

సారాంశం ఏమనగా,

ఇంద్రియాలు ఇంద్రియార్థాలు, మనస్సు, ఆలోచనలు సృష్టి, సృష్టికి దిగిన ఆత్మచైతన్యగర్భమాయ ఇదంతా కల్సినది - మధ్యమ. ఇందులో నీవు, నేను, వాడు

అనే ఆలోచనలు ఇమిడి ఉంటాయి. ఇది త్రిపుటి. అందుకే ఇది "త్రిలోచన ప్రియ" పెరుగుమీద బాగా కట్టిన "మీగడ" వంటిది. లేదా

పెరుగు మొత్తం-పరావాక్కు
దానిమీద గట్టిన మీగడ - పశ్యంతి
సగం చిలికిన దశ - మధ్యమ

వెన్న - నెయ్యి, వైఖరి అనుకోవచ్చును. ఇవి ఉదాహరణలే కనుక జ్ఞానానుకూలంగా దశలను ఊహింపవచ్చును.

డి) **"అథ విరాడ్రూపిణీం బీజాత్మికాం హృదయాదాస్యాంతంఅభివ్యజ్యమానాం శబ్దసామాన్యాత్మికాం వైఖరీమాహ విశేషేణ ఖరత్వాత్ వైఖరీ"**

- పద్మపాద వ్యాఖ్య

**"స్ఫుటీకృతార్థ వైచిత్ర్య-బహిః ప్రసరదాయినీం**
**తుర్యాం శక్తిమహం వందే-ప్రత్యక్షార్థనిదర్శినీమ్"** - అభినవగుప్తః

ఇది ప్రపంచమంతా వ్యాపించింది. స్పష్టమయినది. కఠినంగా అంటే స్థూలంగా వినబడేది అయిన వాక్కు 4వది. ఈ విధంగా ఈ శ్లోకంలో భోజరాజు "వాగ్జ్యోతి" యొక్క లౌకిక-అలౌకిక రూపాలను స్తుతించాడు.

4) సాహిత్యపరంగా ఇది విరోధాభాసాలంకార ధ్వని. ఈ ధ్వని అత్యంత స్పష్టముగా ఉన్నది. కనుక "అగూఢం" అనే గుణీభూత వ్యంగ్యభేదం.

***శ్లో॥ యేనైవ హ్లాదతే విశ్వం-స్వయం దుర్లక్షమేవ యత్***
***తద్భానార్థం న వై దేవాః-జ్యోతిస్సారస్వతం స్తుమః*** **12**

**ప్రతిపదార్థము :** యేనైవ=దేనిచేత మాత్రమే, విశ్వమ్=ప్రపంచం, హ్లాదతే= ఆనందపడునో, యత్=ఏది, స్వయమ్=స్వయముగా, దుర్లక్షమేవ= గమనింప రానిదో, తత్=ఆ జ్యోతి యొక్క, భానార్థమ్=ప్రకాశమునకు, దేవాః=దేవతలు, న వై=ఉపయోగింపరో ఆ, సారస్వతమ్=సరస్వతీ సంబంధమయిన, జ్యోతిః= వెలుగును, స్తుమః=స్తుతించెదము.

**భావము :** ఎవరికి కనబడని ఆ జ్యోతి వలననే ఈ ప్రపంచము ఆనందం పొందును. ఈ జ్యోతిని ప్రకాశింపచేయుట దేవతలకున్ను శక్యము కాదు. అంటే ప్రపంచాన్ని ప్రకాశింపజేసే తేజస్సు ఇది. ప్రపంచంలో అంతర్భాగం దేవతలు. వారు ఈ అనాది జ్యోతిని వెలిగించలేరు.

**"న తత్ర సూర్యో భాతి న చంద్రతారకాః"**

అన్నటువంటి తేజస్సు. అట్టి సారస్వత తేజస్సు స్తవనీయము.

**విశేషములు :**

1) **నియతికృత నియమ రహితాం-హ్లాదైకమయీ మనన్యపరతంత్రాం**
**నవరసరుచిరాం నిర్మితి-మాదధతీ భారతీ కవేః జయతి**
అని మమ్మటుడు అన్నట్లు కావ్యసరస్వతి గూడా విశ్వహ్లాదిని.

2) **"రవి గాననిచో కవి గాంచునే కదా"**
అన్నట్లు రవికి అందనివి గూడా 'కవిత'కు అందుతాయి. కనుక దీని ప్రకాశశక్తి విశ్వాహ్లాదన శక్తి అధికము.

3) దేవతలు గూడా దీనిని ప్రకాశింపజేయలేరు. కాని దేవతలనే ఇది ప్రకాశింపజేస్తుంది. ఆ విషయం వేదవాక్య సిద్ధం.

**ఋచో అక్షరే పరమే వ్యోమన్-యస్మిన్ దేవా అధి విశ్వే నిషేదుః**
**యస్తన్నవేద కిమృచా కరిష్యతి-య ఇత్తద్విదుస్త ఇమే సమాసతే**
దేవతలందఱు వేదవచన సంబంధమయిన అక్షరంలో ఉన్నారుట. దానిని తెలిసికొంటే దేవతలు తెలుస్తారట.

**"ఋచో హ యే వేద స వేద దేవాన్** - బృహద్దేవతా
ఋక్కులు తెలిసినవానికే దేవతలు తెలుస్తారు.

**మంత్రాణాం దేవతావిద్యః-ప్రయుంక్తే కర్మ కర్హిచిత్**
**జుషంతే దేవతాస్తస్య-హవిర్నాదేవతా విదః** - బృహద్దేవతా
మంత్రాల వలన దేవతాజ్ఞానం వస్తుంది, దేవతల వలన మంత్రజ్ఞానం రాదు. కనుకనే

**తద్భానార్థం న వై దేవాః** అన్నాడు.

శ్లో॥ ***ధ్యాయతః స్తువతో వాపి-జపతః స్మరతోఽపి వా,***
***వాగ్దేవతే త్వాం నియతమ్-అచ్ఛిన్నా వాక్ ప్రవర్తతే॥*** **13**

**ప్రతిపదార్థము :** వాగ్దేవతే=ఓ వాగ్దేవీ, త్వామ్=నిన్ను, ధ్యాయతః=ధ్యానించు వానికి, స్తువతః వాపి=స్తుతించువానికి గాని, జపతః=జపించువానికిగాని, స్మరతోపి వా=స్మరించువానికిగాని, నియతమ్=తప్పక, అచ్ఛిన్నా=నిరంతర మైన, వాక్=వాగ్ధోరణి, ప్రవర్తతే=సాగును.

**భావము :** ఓ భారతీ ! నిన్ను ధ్యానం చేసినా, స్తుతించినా, జపించినా కేవలం తలచినా అట్టివానికి వాక్కు నిరంతరాయంగా ప్రవహించును.

శ్లో॥ ***సితపఙ్కజకాన్తిర్యా-యా సితామ్బురుహాననా,***
***సితాబ్జదళనేత్రా యా-సా నః పాతాత్సరస్వతీ॥*** **14**

**ప్రతిపదార్థము :** యా=ఏ దేవత, సిత=తెల్లని, పంకజ=తామరపూవు వంటి, కాంతిః =కాంతిగలదో, యా=ఏ దేవత, సిత=తెల్లని, అంబురుహ=పద్మం వంటి, ఆననా= ముఖంకలదో, యా=ఏ దేవత, సిత=తెల్లని, అబ్జ=కమలము వంటి, నేత్రా=కన్నులు గలదో, సా=ఆ, సరస్వతీ=సరస్వతి, నః=మమ్ములను, పాతాత్=రక్షించుగాక !

**భావము :** శ్వేతకమల ధవళకాంతి, ధవళపద్మముఖి, శుభ్రారవింద నేత్ర అయిన సరస్వతి మమ్ములను రక్షించుగాక !

**విశేషములు :**

1) ఈ విశేషణాలు సరస్వతికి నదీరూపంలోను అన్వయించును. నదులలో కమలవర్ణన కవి సమయము.

2) **"శరదిందువికాసమందహాసాం......"**
**"యా కుందేందు తుషారహార....."**
**"శరజ్జ్యోత్స్నా శుద్ధాం....."**
**"అంబనవాంబుజోజ్జ్వలకరాంబుజ"**

ఇత్యాదిగా కవులందఱు సరస్వతిని సత్వమూర్తిగా చంద్రకాంతిగా వర్ణిస్తుంటారు. 'జ్ఞానం' సహజంగా సత్వగుణ ప్రధానం గనుక ఇలా వర్ణన జరుగుతుంది.

**శ్లో॥ *ప్రాలేయధవళాం దేవీం-శఙ్ఖకున్దేన్దురోచిషమ్।***
***స్తుమః తామృగ్యజుస్సామ్నామ్-ఏకం ధామ సరస్వతీమ్॥*** **15**

**ప్రతిపదార్థము :** ప్రాలేయ=మంచువలె, ధవళామ్=తెల్లనిదియు, శంఖ= శంఖము వలె, కుంద=మొల్లపూలవలె, ఇందు=చంద్రునివలె తెల్లని, రోచిషమ్ =కాంతి కలదియు, ఋక్=ఋగ్వేదమునకు, యజుః=యజుర్వేదమునకు, సామ్నామ్=సామవేదమునకు, ఏకమ్=ఒక్కటే, ధామ=స్థానము అయిన, తామ్=ఆ, సరస్వతీమ్=సరస్వతిని, స్తుమః =స్తుతించెదము.

**భావము :** మంచువలె, శంఖమువలె, మొల్లపూలవలె, చంద్రునివలె తెల్లనిది, వేదత్రయమునకు మూలస్థానమున్ను అయిన సరస్వతిని స్తుతించెదము.

**విశేషములు :**

వేదత్రయ స్థానం అని నాదశక్తిని అభివర్ణించాడు భోజుడు. వేదత్రయమున్ను ఈమెకే స్థానమని తత్త్వం చెప్పింది సరస్వతీ రహస్యోపనిషత్తు.

**యా సాంగోపాంగవేదేషు-చతుర్ష్వేకైవ గీయతే।**
**అద్వైతా బ్రహ్మణశ్శక్తిః-సా మాం పాతు సరస్వతీ॥**

బ్రహ్మకలగా ఆమె వేదప్రతిపాదిత.

**"వందే మహి చ తాం వాణీ-మమృతా మాత్మనః కలామ్"** - అన్నాడు భవభూతి.

**శ్లో॥ చన్ద్రకాన్తసముద్భూత-సితపద్మాసనస్థితామ్**
**త్వాముదూర్ధ్వం ధ్యాయతో వా-వాగచ్ఛిన్నా ప్రవర్తతే॥ 16**

**ప్రతిపదార్థము :** చంద్రకాంత=చంద్రకాంతమణియందు, సముద్భూత=పుట్టిన, సిత=తెల్లని, పద్మాసన=పద్మపీఠమునందు, స్థితామ్=ఉన్న, త్వామ్=నిన్ను, ఉదూర్ధ్వమ్= మిక్కిలి పైన, ధ్యాయతోవా=ధ్యానించువానికయినను, వాక్= వాక్కు, అచ్ఛిన్నా= ఎడతెగనిదిగా, ప్రవర్తతే=సాగుచుండును.

**భావము :** దేవీ ! భారతీ ! చంద్రకాంత శిలావితర్దియందున్న ధవళ పద్మ పీఠముననున్నట్లు నిన్ను ధ్యానించినా, అట్టి ఉపాసకునకు "వాక్కు" నిర్విఘ్నముగా ప్రవహించును.

**విశేషములు :**

1) చంద్రకాంత సముద్భూత - వద్ద కొన్ని ఇతరమయిన అర్థాలు తోచుచున్నవి.

ఎ) చంద్రక=నెమలికన్ను, అంత=మనోహరమయిన, కాగా చంద్రకాంత =నెమలి (కన్నులతో మనోహరమయినది), దానియందు ఏర్పడిన ధవళపద్మ పీఠము అని అర్థం చెప్పవచ్చు. సరస్వతి హంసవాహనగాను, మయూర వాహనగాను ప్రసిద్ధురాలు.

బి) "ఉత్" అనగా జీవుడు. అక్షి పురుషుడు అని ఛాందోగ్యం చెప్పింది. ఆ "ఉత్"కన్న ఊర్ధ్వంలో అనగా భ్రూమధ్యం పైన ధ్యానం చేయడం అని చెప్పవచ్చును. అపుడు చంద్రక అంటే సహస్రార చంద్రుడు అని చెప్పవచ్చును. దాని అంతమందు అంటే 'చివఱ' అవుతుంది. అచ్చట పుట్టిన పద్మం అంటే "మనః" పద్మం. ఆజ్ఞాచక్ర ప్రదేశం కావచ్చును. లలాట ప్రదేశమున మూడు శక్తులు ఉన్నట్లు శారీరక యోగ సాక్ష్యం.

**"మాయాశక్తిః లలాటాంత-భాగే వ్యోమాంబుజాదధః"**
**"నాదరూపా పరాశక్తిః-లలాటస్య తు మధ్యమే"**
**"భాగే బిందుమయీ శక్తిః-లలాటస్యాపరాంశకే"** -సూతసంహిత

ఈ విధంగా లలాటంలో సహస్రారపద్మ, ఆజ్ఞాచక్రముల మధ్య "3" శక్తులు, అందులో నాదశక్తి ఉన్నట్లు సాక్ష్యం. కనుక ఈ శ్లోకం "నాదశక్తి"ని గూర్చి చెప్పినట్లు అనిపిస్తున్నది.

సి) ఆజ్ఞాచక్రం - తెల్లని చక్రం 'చంద్రకాంతి' సముద్భూత పద్మం అంటే ఆజ్ఞాచక్ర పద్మం కావచ్చును.

**"భ్రువోర్మధ్యే శుభ్రవర్ణం..."**
**ధ్యేయాతు హాకినీ శక్తిః-చంద్రకాంతి సమప్రభా"** - చక్రకౌముది
దీనిపైన యీ చంద్రకాంతి సముద్భూత పద్మం కావచ్చును.

**"ఏతత్పద్మస్యోర్ధ్వదేశే-జ్ఞానపద్మం సుదుర్లభం**
**పత్రద్వయసమాయుక్తం-పూర్ణచంద్రస్య మండలమ్"**
అని ఆజ్ఞాచక్రంలోని పద్మంగూర్చి చెప్పింది. - నిర్వాణ తంత్రం
ఈ పద్మం "చంద్రకాంతి సముద్భూత సిత పద్మం" కావచ్చును.

శ్లో॥ ***సువర్ణఘటనాచిత్ర-నానాలఙ్కారభూషణామ్ ।***
***సితాం సువసనాం వన్దే-దేవీం వాగధిదేవతామ్ ॥*** **17**

**ప్రతిపదార్థము :** సువర్ణ=బంగారము యొక్క, మంచి అక్షరాల యొక్క, ఘటనా=కూర్పు చేత, చిత్ర=వివిధ రూపములు గల, నానా=అనేక, అలంకార =నగలు, శబ్దాలంకార అర్థాలంకారములు, భూషణాం=సొమ్ములుగా గలదియు, సితామ్=తెల్లనిదియు, సువసనామ్=మంచి వస్త్రములు గలదియు అగు, వాగధిదేవతామ్=వాక్కుకు అధిదేవత అయిన, దేవీమ్=సరస్వతిని, వందే= స్తుతించెదను.

**భావము :** సరస్వతి అనేక సువర్ణ ఆభరణములు ధరించినది. కవి నిర్మితములయిన అక్షరాలంకారములు ధరించిన కావ్యకల ఆమె. ధవళ విగ్రహ. ధవళ వస్త్ర. వాగ్దేవత అయిన సరస్వతికి నమస్కారము.

**విశేషములు :**

1) వర్ణ=అంటే రంగులు, అక్షరాలు, కులాలు అని అర్థం. సృష్టి శక్తి అనుకొన్నప్పుడు రకరకాల రంగులు, కులాలు సృష్టించిందని తద్వారా ప్రకృతిమాతగా తనను అలంకరించుకొన్నదని చెప్పవచ్చును.

2) అక్షరాలు-అనే అర్థంలో చక్కని భాష, మంచి కవిత ఆమె స్వరూపమని చెప్పవచ్చును. "కావ్యకలా" అని చెప్పవచ్చును.

3) సితాంశువసనాం-అని ఒక పాఠం. అంటే చంద్రధవళమయిన వస్త్రములు గలది అని అర్థం. లేదా 'చంద్రమండల మధ్య నివాసము గలది' అని చెప్పవచ్చును. దేవిని 'సూర్యచంద్రమండల మధ్య నివాసినిగా ఉపాసనలు చేయడం ఉన్నది.

4) సితాం-షిఞ్ బంధనే అని ధాతువు. బంధింపబడినది అని అర్థం. కావ్యపక్షంలో "శయ్యా"రూప బంధం గలది మొ॥ అర్థములు రావచ్చును. చక్కని శైలీబంధం గలదని అర్థము.

శ్లో॥ ***అకల్పమపి కల్పం యత్-సదాప్యమపి పావకమ్ / పావనమ్***
***తద్విరుద్ధస్వరూపం నః-పాయాత్ సారస్వతం మహః*** **18**

**ప్రతిపదార్థము :** అకల్పమ్ అపి=కల్పించే వస్తువు లేనిది, కల్పము కానిది అనగా స్వయంగా ఆవిర్భవించినది అయినను, కల్పమ్=కల్పము అనే శాస్త్రం కలది, కల్పనలు గలది, సదా=ఎల్లప్పుడు, ఆప్యమపి=పొందదగినదయినను, జలసంబంధమయిన దయినను, పావకమ్=పవిత్రమయినదియు, అగ్ని స్వరూపమయినదియు, అయినది, యత్=ఏదో, తత్=ఆ, విరుద్ధ=పరస్పర విరుద్ధమయిన, స్వరూపమ్=రూపతత్త్వముగల, సారస్వతమ్=సరస్వతీ సంబంధమయిన, మహః=తేజస్సు, నః=మనలను, పాయాత్=రక్షించుగాక.

**భావము :** దేవి సరస్వతిని శ్లేషతో విరుద్ధ గుణములు గల శక్తిగా వర్ణన చేస్తున్నాడు.

ఆమె ఒక స్వయంజ్యోతి. ఇది కల్పించినవారులేనిది. అందుచే అకల్పం. కాని చాలా కల్పనలు గలవు. లేదా కల్పనలు చేస్తుంది. కనుక కల్పము. అందరికి పొందదగినది కనుక ఆప్యం. అంతేగాదు పవిత్రం చేసేది కనుక పావకం లేదా పావనం. ఇది విరుద్ధత. (దీనిలోని ప్రత్యేకత "విశేషములు"లో చూడదగును.) అట్టి విరుద్ధ లక్షణము అయిన సారస్వత జ్యోతి మనలను రక్షించుగాక !

**విశేషములు :**

1) ఇందులో కవి విరోధాభాసాలంకారం ఉపయోగించాడు. అంటే ఒక అర్థంలో చూస్తే విరుద్ధంగా కనబడ్తుంది. మఱొక అర్థం చూస్తే ఆ విరోధం పోతుంది. అందువలన విరోధం ఆభాసిస్తుంది. కనుక విరోధాభాసాలంకారం. దీనికి "శ్లేష" అవసరం. అదే యిందులో ఉపయోగింపబడింది.

ఎ) కల్పః=కల్పము, కల్పన, కల్పించువాడు అని "3" అర్థాలు. కల్పము= కాలవిభాగం, "కల్పం" అనే ఒక శాస్త్రం అని గూడా అర్థాలు.

అకల్పము-అయినా కల్పము అనడం వలన విరోధం. 'కల్పం కానిది - కల్పం' అయినట్లు ఇది విరోధం. కాని కల్పము అనే కాలవిభాగములు లేని అనాద్యనంత శక్తి అని, సృష్టిని కల్పించడం అనే ప్రక్రియ చేసేది అని ఒక అర్థం. ఇందులో విరోధం లేదు. కల్పించువాడు లేనిది అనగా స్వయంభువు. తానే కల్పించేది అనగా సృష్టిశక్తి అని ఒక అర్థం. ఇందులోనూ విరోధం లేదు. దీనిలోనే కల్పం అన్నచో 'అర్శ-ఆది-అచ్' చేస్తే కల్పం అనే శాస్త్రం గలది అని మఱొక అర్థం. ఇలా గూడా విరోధం లేదు. అలానే స్వరూపంలో కాలవిభాగం లేనిది మన దృష్టిలో కాలవిభాగం కలది అని చెప్పవచ్చును. ఇలా విరోధ పరిహారం జరిగింది.

బి) సదా=ఎల్లపుడు, ఆప్యం=పొందదగినది, సత్=మంచివారిచేత, ఆప్యం= పొందదగినది, సత్=ఓంకారముచేత, ఆప్యం=పొందదగినది, సదా=ఎల్లపుడు, ఆప్యం=నీటి సంబంధం అయినది, నీటిలో పుట్టినది.

పావకం/పావనం అని 2 పదాలు. “2” పదాలకు పవిత్రమయినది అను అర్థం కలదు. 2వ అర్థం మారుతుంది.

ఎ) పావకం = అగ్ని రూపమయినది, అగ్నిర్వాగ్భూత్వా ముఖం ప్రావిశత్ అన్న శ్రుతి ప్రకారము ‘వాక్’ అగ్ని.

బి) పావనం = అనగా పవన = వాయువు సంబంధం అయినది. అనగా ‘వాక్’ నాదం కనుక నాదం శ్వాసజన్యం కనుక “పావనం” అవుతుంది.

ఇందులో జలసంబంధమయినది అనే అర్థానికి అగ్ని సంబంధ మయినది/ వాయు సంబంధమయినది అనే అర్థం విరుద్ధం అయినది. కాని పవిత్రమయినదని అర్థం చెప్తే విరోధం లేదు. కనుక శ్లోక ప్రథమార్ధంలో విరోధాభాసాలంకారం కలదు.

**శ్లో॥ *జయత్యదృష్ట పూర్వం తత్-వాగ్జ్యోతిరపరాణి యత్***
***సదా పరిభవత్యేవ-తేజాంసి చ తమాంసి చ॥*** **19**

**ప్రతిపదార్థము :** యత్=ఏ జ్యోతి, అపరాణి=ఇతరములయిన, తేజాంసిచ= తేజస్సులను, తమాంసిచ=చీకట్లను, సదా=నిత్యము, పరిభవత్యేవ= పరాభవించుచునే యుండునో, తత్=ఆ, అదృష్టపూర్వం=ఇంతకుముందు కనబడని, వాగ్=వాక్కు అనబడు, జ్యోతిః =జ్యోతి, జయతి=ప్రకాశించుచున్నది.

**భావము :** చీకట్లనేగాక సాటి తేజస్సులను గూడా పరాభవించునట్టి విచిత్ర తేజము అయిన “వాగ్జ్యోతి” లోకమును జయించును.

**విశేషములు :**

1) అదృష్టపూర్వం – దీనికి చాల అర్థాలు రావచ్చు.

ఎ) ఇంతకుముందు ఎవరిచేత చూడబడనిది.

బి) ఎవరిచేత చూడబడని పూర్వము కలది అనగా అనాది.

సి) అ=శివుడు, బ్రహ్మము, అట్టి పరమాత్మ చేత ముందుగా చూడబడిన దయిన ‘పరా’ వాక్కు.

డి) ‘అ’కారము చేత చూడబడిన పూర్వభాగం కలది – అనగా (అ+ఉం) ఓంకారము=కాగా నాదజ్యోతి. ఇక

2) అపరాణి = అనగా ఇతరములయిన అని ఒక అర్థం. ‘పరా’ కాని వాక్కులు అని ఒక అర్థం. ‘పరబ్రహ్మం’ కానివి అని ఒక అర్థం. ‘పరా’శక్తి / పరావాక్కు. కనుక ఇతర ‘పశ్యంతీ’ మొ॥ శక్తులను, వాక్కులను మించి యీ వాగ్జ్యోతి ప్రకాశించును. తేజస్సులను పరిభవించడం అనేది యిచ్చట విచిత్రం. అదే అదృష్ట పూర్వత. కాని సూర్యతేజస్సు ఇతర తేజస్సులకు మించి ప్రకాశించడం సహజమే కనుక ఇందులో

వచ్చిన విచిత్రత ఏమిటి అన్నది ప్రశ్న. సమాధానం ఏమనగా, 'పరిభవించుట' అన్నదానికి '2' అర్థాలు వస్తాయి. 1) మించి ప్రకాశించడం, ఈ అర్థంలో విచిత్రం ఏమియు లేదు. 2) అవమానించుట – తమస్సులను జ్యోతి అవమానించటం సహజమే. కాని వాటితో సమానంగా 'తేజస్సులను' అవమానించడం అసహజం. ఇవి తేజస్సుకు సాటివి గదా ! సాటివారిని, తనవారిని అవమానించడం వింత.

ఇది తుల్యయోగితాలంకారము. అంటే తమస్సులను తిరస్కరించడం, తేజస్సులను మించడం అనే అర్థభేదంతో "పరిభవతి" అనే పదం మిత్ర శత్రువుల విషయంలో వాడడం వలన "తుల్యయోగం" ఏర్పడింది.

3) ఈ శ్లోకంలో దేవియొక్క సర్వభాసకత్వం చెప్పబడినది. దీనివలన ఆమెను సగుణబ్రహ్మగా చెప్పినట్లయినది.

**"న తత్ర సూర్యో భాతి న చంద్రతారకం"**

4) "రవి కాననిచో కవి కాంచునే కదా" అన్నట్లు రవి తేజస్సుకు అందని అనేక భావాలు కవి తేజస్సు అయిన వాగ్జ్యోతికి అందుతాయని వ్యతిరేకాలంకార ధ్వని. తద్ద్వారా ఇతర తేజస్తిరస్కారము సరిపడును.

5) **"ఏవంత్వమేకం నాప్యేకం–చంద్రార్క జ్యోతిరేవ చ"** –అశ్వతరుని సరస్వతీస్తుతి

**శ్లో॥** ***సఙ్కోచప్రసరావస్య–జగతః ప్రవితన్వతీ।***
***కథయన్తీవ వాగ్వోఽవ్యాత్–ద్వైరూప్యం పరమాత్మనః॥*** **20**

**ప్రతిపదార్థము :** అస్య=ఈ, జగతః=ప్రపంచమునకు, వాఙ్మయమునకు, సంకోచ= సంకోచమును, ప్రసరౌ=వ్యాకోచమును, ప్రవితన్వతీ= చేయుచు, పరమాత్మనః=పరమాత్మ యొక్క, ద్వైరూప్యం=సగుణ నిర్గుణరూపములను, శబ్ద, అర్థ రూపములను, కథయంతీవ=చెప్పుచున్నట్లున్న, వాక్=వాగ్దేవి, వః=మిమ్ములను, అవ్యాత్=రక్షించుగాక!

**తాత్పర్యము :** ఇది పశ్యంతీవాక్ ప్రార్థన. 'పరనుండి' పశ్యంతి వస్తుంది. అది సృష్టి ప్రారంభము. పశ్యంతి నుండి 'పర'కు వెళ్ళడం జరుగుతుంది. ఇది ప్రలయం. వాక్కు అయినా అంతే. పరనుంచి పశ్యంతి – మధ్యమ–వైఖరీ. ఇది వాఙ్మయం. వైఖరీ, మధ్యమ, పశ్యంతి – పరా, ఇది మౌనం. వాక్ప్రలయం. ఈ విధంగా పరాశక్తిగాని పరావాక్కుగాని 'పశ్యంతీ' రూపంతో ప్రపంచానికి, వాఙ్మయానికి సంకోచ ప్రసరాలు కల్గిస్తుంది. ఇట్టి వాగ్దేవి పరమాత్మకు గూడా అట్టి సంకోచ ప్రసరములు గల రూపద్వయం ఉన్నట్లు సూచిస్తున్నట్లున్నదిట.

**విశేషములు :**

1) ఇందులో అస్య–అనగా అకారమునకు లేదా అకారవాచ్యుడయిన పరమాత్మకు

అని అర్థము చెప్పవచ్చును. అపుడు నాదశక్తి అకారానికి ప్రసారం ఇచ్చి అక్షరమాలను పుట్టిస్తుంది. లేదా అకారాన్ని ముందటికి ప్రసరింపజేసి "ఉమ"గా అయి ప్రపంచాన్ని పుట్టిస్తుంది. బ్రహ్మకు వ్యాకోచం తెచ్చి సగుణ బ్రహ్మను జీవులుగా చూపించి ప్రపంచాన్ని సృష్టిస్తుంది. లేదా సంకోచం చేస్తుంది. సర్వాక్షరాలను వదలి 'అ' దగ్గఱకు వస్తుంది. అంటే అవ్యక్తనాదశక్తిగా శివరూపంగా ఉండిపోతుంది. అకారాన్ని వెనుకకు తెచ్చి 'ఓం' అవుతుంది. ప్రళయంలో సర్వప్రపంచాన్ని బ్రహ్మలో లయం చేస్తుంది. ఇలా వ్యాఖ్యానించ వచ్చును. "ఉన్మేషనిమిషోత్పన్న విపన్నభువనావళిః" కదా !

**శ్లో॥ *యద్భాసయతి తేజాంసి-తేజోభిర్యన్న భాసతే,***
***దర్శయత్యాత్మనాత్మానం-తజ్జ్యోతిః వాఙ్మయం స్తుమః॥*** **21**

**ప్రతిపదార్థము :** యత్=ఏది, తేజాంసి=తేజస్సులను, భాసయతి=వెలిగించునో, యత్=ఏది, తేజోభిః=ఇతర తేజస్సులచేత, నభాసతే=వెలుగదో – అంటే స్వయం ప్రకాశమానమో, ఆత్మనా=తనతో, ఆత్మానమ్=తనను, దర్శయతి= చూపించునో, తత్=ఆ, వాఙ్మయమ్=వాగ్రూపమయిన, జ్యోతిః=జ్యోతిని, స్తుమః=స్తుతించెదము.

**భావము :** ఏది తేజస్సులనే వెలిగించునో, తేజస్సులు దేనిని వెలిగించలేవో, ఏది తనను తనే చూపించుకొనునో ఆ వాగ్రూప జ్యోతిని స్తుతించెదము.

**విశేషములు :**

1) సూర్యునితో పోల్చినచో ఈ శ్లోకం బాగా అర్థం అవుతుంది. సూర్యతేజస్సు వలన మిగిలిన తేజస్సులు వెలుగుతాయి. ఏ తేజస్సు గూడా సూర్యతేజస్సును వెలిగించలేవు. దానిముందఱ దిష్టిబొమ్మలలాగా ఉంటాయి. సూర్యుణ్ణి సూర్యుడే చూపించగలడు.

2) శబ్దబ్రహ్మరూపమయిన ప్రణవ పరమాత్మ తేజమే సర్వతేజస్సులకు మూలం. తేజస్సులు అంటే తేజోమయమూర్తులయిన దేవతలు, వారి ఆధిపత్యంలోని మన అవయవాలు. వీటికన్నింటికి ఆత్మతేజమే ప్రకాశ హేతువు. వీటి ప్రకాశం వలన ఆత్మ ప్రకాశింపదు. పైగా ఆవరణంలోపడి ఆత్మ ప్రకాశం కనబడదు. ఆత్మ స్వయంప్రకాశం. ఇతర వెలుగులయిన అంతఃకరణాదులు నివృత్తమయినపుడు ఆత్మ తననుతానే దర్శింపజేసికొనును.

3) ప్రాణరూపమయిన వాక్కు మధ్యమావాక్కు. సరస్వతీ రహస్యోప నిషత్తులో దీనిని గూర్చి ఇలా ఉన్నది.

**"అధ్యాత్మమధిదైవం చ దేవానాం సమ్యగీశ్వరీ,**
**ప్రత్యగాస్తే వదంతీ యా సా మాం పాతు సరస్వతీ"**

దేవతలు తేజోరూపులు. వారికి ఈశ్వరి సరస్వతి. వారికి భిన్నంగా ఉండి వారిని గూర్చి చెప్పుచూ ఉండేది సరస్వతి.

4) **న తత్ర సూర్యో భాతి న చంద్రతారకం**
**నేమా విద్యుతో భాంతి కుతోయమగ్నిః**
**తమేవ భాంతమనుభాతి సర్వం**
**తస్య భాసా సర్వమిదం విభాతి**
అను బ్రహ్మస్వరూప వర్ణనమే ఈ శ్లోక తాత్పర్యం.

5) **"శబ్ద బ్రహ్మణి నిష్ణాతః పరం బ్రహ్మాధిగచ్ఛతి"** – శ్రుతి

ఈ వాక్యం ప్రకారం ఆలోచిస్తే వాగ్జ్యోతికి '2' రూపాలు ఉన్నాయి. ఒకటి ప్రథమంగా ఉన్న ప్రకాశ రూపము. దానికి వాగ్రూపము అంటే నాదరూపం అకారం, లేదా ఓం. ఇందులో 'ఓం'కార రూప – ఆత్మ ఉపాసన వలన జ్యోతి/ప్రకాశరూప పరమాత్మను చేరవచ్చును. "సర్వే వేదా యత్పద మామనంతి' అన్నట్లు ఓంకారం బ్రహ్మస్వరూపం అయిన నాదం కనుక 'శబ్దబ్రహ్మ', దానియందు యోగపరంగా అధికారి అయిన వాడు నాదాంత గమ్యమయిన బ్రహ్మమును పొందగలడు. కనుక "ఆత్మనా ఆత్మానం దర్శయతి" అన్నాడు భోజుడు.

6) లేదా ఒక శబ్దం యొక్క అర్థాన్ని పొందాలంటే మనం ప్రతిపదార్థ రూపంలో మఱొక శబ్దాన్ని చెప్పుతాం. అలానే భాషాంతరీకరణంలోను, వివరణ కొఱకు పదంతో పదాన్ని పొందుతాం. తద్ద్వారా అర్థస్ఫూర్తి కనుక "ఆత్మనా ఆత్మానం దర్శయతి" అనవచ్చును.

7) లేదా వాచ్యవాచక భావ సంబంధం చేత శబ్దం, అర్థం – 2 మధ్య అభేదం చెప్పవచ్చును. అర్థం శబ్దానికి 'ఆత్మవంటిది కనుక శబ్దం గూడా ఆత్మయే. కనుక "ఆత్మనా ఆత్మానం" అనవచ్చును.

8) లేదా 'రసో వై సః' అన్నట్లు రసరూప ఆత్మను కావ్యరూపమయిన శబ్దబ్రహ్మతో అనగా తనతో (ఆత్మ) అందుకొంటాం కనుక 'ఆత్మనాత్మానం' అనవచ్చును. అలానే వాచ్యార్థం ద్వారా లక్ష్యార్థ వ్యంగ్యార్థాలను తెలుపునట్టిది.

9) కావ్యం విలక్షణ సృష్టి. దానిలోకం వేఱు. మనలోకం వేఱు.
**అపారే కావ్యసంసారే కవిరేకః ప్రజాపతిః।**
**యథాస్మై రోచతే విశ్వం తథేదం పరివర్తతే॥** కనుక మనం చూడలేనివి కావ్యకల చూపిస్తుంది. కావ్యకల చూపించినవి మనకు ఇహలోకంలో దొఱకవు. కనుక అది తననుతానే చూపించికొంటుంది.

**"రవి గాననిచో కవి గాంచునే కదా"**

ఈ శ్లోకాన్ని ఇలా గూడా వ్యాఖ్యానించవచ్చును. ఇది కావ్యరూప వాగ్దేవికి వర్ణన.

10) జ్యౌతిషసరస్వతికి గూడా యీ శ్లోకం కానుక కావచ్చును. తేజోరూపములయిన రవ్యాది గ్రహములను తెలియజేస్తుంది గదా !

**శ్లో॥ *విద్యాతత్త్వం ద్విధా యత్త-న్నాదాత్మక పదాత్మకమ్।***
***తత్పుస్తకాక్షసూత్రాభ్యాం-దర్శయంత్యస్తు వాక్ర్శియే॥*** **22**

**ప్రతిపదార్థము :** నాదాత్మక=కేవల నాదస్వరూపంగా, పదాత్మకమ్=పద స్వరూపంగా, ద్విధా=2 విధములుగా, విద్యాతత్త్వమ్=విద్యాస్వరూపం, యత్= ఏది ఉన్నదో, తత్=దానిని, పుస్తక=పుస్తకం చేత, అక్షసూత్రాభ్యామ్=జపమాల చేత, తత్=దానిని, దర్శయంతీ=చూపుచున్న, వాక్=వాగ్దేవి, శ్రియే=సంపద కొఱకు, అస్తు= అగుగాక !

**తాత్పర్యము :** విద్య '2' రకాలు. నాదం-పదం. నాదానికి తరువాత స్వరూపం వర్ణమాల. దానిని అక్షమాల అంటారు. 'అ' నుంచి 'క్ష' వఱకు అక్షరాలుంటాయి కనుక 'అక్ష' - అంటే వర్ణమాలకు సంకేతము. ఈ లెక్కతోనే మనలోపల గూడా ఆయా చక్రాలలో అక్షరాలుంటాయి. దీనిని 'అంతర్మాల' అంటారు. జపమాలను 'అక్షమాల' అంటారు. ఈ అక్షమాలతో - అంటే అక్షరసంఖ్యగల మాలతో లోపలి అక్షమాలను అంటే "అ" నుంచి "క్ష" వఱకు ఉండే అంతర్మాలను జపస్మరణ చేస్తాం కనుక అందుకు సూచనగా నాదశక్తి అయిన సరస్వతి చేత 'అక్షమాల' ఉంటుంది. కాగా 'అక్షమాల' నాదానికి గుర్తు. పదరూప విద్యాశక్తికి 'పుస్తకం' గుర్తు. ఈ '2' వస్తువులు వెఱసి వ్యక్తనాద రూపమయిన 'వైఖరీ' వాక్కుకు గుర్తు. నాదపద స్వరూప విద్యాతత్త్వ ద్వయానికి గుర్తుగా పుస్తక-అక్షసూత్రములను ధరించిన 'సరస్వతి' మనకు సంపదను ఇచ్చుగాక !

**విశేషములు :** వర్ణాత్మికా, భాషా, భారతీ అన్న నామాలు ఈ శ్లోకంలో ప్రస్తావింపబడినవి.

**శ్లో॥ *జీవితస్యేహ వాక్సారః-వాచః పునరిదం ద్వయమ్।***
***వక్తృత్వం చ కవిత్వం చ-తద్వాణి ! త్వత్ప్రసాదతః॥*** **23**

**ప్రతిపదార్థము :** వాణి!=భారతీ!, ఇహ=ఈలోకమునందు, జీవితస్య= జీవితమునకు, వాక్=వాక్కు, సారః=శ్రేష్ఠమయినది, వాచఃపునః= వాక్కుకయితే, వక్తృత్వమ్=వక్తృత్వము, కవిత్వఞ్చ=కవిత్వమున్ను, ఇదమ్=ఈ, ద్వయమ్ =జంట, సారః=సారము, తత్=ఆ జంట, త్వత్=నీయొక్క ప్రసాదతః=అనుగ్రహం వలన లభించును.

**భావము :** ఈ లోకంలో సారమయినది వాక్కు. ఇంకా సారమయినవి వక్తృత్వము, కవిత్వము. ఈ "2" నీ దయా విశేషం వలననే లభించును.

**విశేషములు :**

1) దేవికి, కావ్యకలా, రసజ్ఞా, రసశేవధిః అని పేర్లు గలవు.

2) **మధుమధురం తస్మాచ్చసుధా- తస్యాః కవేర్వచః**
అని కవివాక్కు మధురం అని ప్రసిద్ధం.

3) **"సద్యః పరనిర్వృతయే"** అన్నాడు మమ్మటుడు. అట్టి కవిత్వం సరస్వతి యొక్క విశేషానుగ్రహ లభ్యం.

4) పాశ్చాత్యకవి "Milton" గూడా తమ "Muse" అనే సరస్వతి గురించి ఇలానే అన్నాడు. చూ॥ పీఠిక.

***శ్లో॥ అఖిలేఽపి జగద్రంగే-నృత్యంతీ లలితైః పదైః।***
***నర్తయత్యఖిలం విశ్వం-యా న స్సా పాతు భారతీ॥*** **24**

**ప్రతిపదార్థము :** యా=ఏ దేవి, అఖిలే+అపి=సమస్తమయిన, జగత్= ప్రపంచమనే, రంగే=రంగస్థలంలో, లలితైః=కోమలమయిన, పదైః=పదములచే, పాదములచే, నృత్యన్తీ=నృత్యం చేయుచున్నదై, అఖిలమ్=సమస్తమయిన, విశ్వమ్= ప్రపంచమును, నర్తయతి=నృత్యం చేయించుచున్నదో, సా=ఆ, భారతీ= నాట్య భారతి, నః=మమ్ములను, పాతు=రక్షించుగాక !

**భావము :** ప్రపంచ రంగస్థలం మీద లలితపదాలతో నిత్యం నృత్యం చేస్తూ ప్రపంచాన్ని ఉఱ్ఱూతలూగిస్తున్న భారతీదేవి మనలను రక్షించుగాక !

**విశేషములు :** 1) భారతీ అంటే భూలోకాన్ని భరించేది కనుక 'భారతి' అని పేరు. ఈ విషయంలో శౌనకాచార్య వాక్యం ఉంది.

**"అగ్ని మేవానుగేలాతు, మధ్యం ప్రాప్తె సరస్వతీ,**
**అముం స్థితాధిలోకం తు భారతీ భవతి హ్యసౌ"** - బృహద్దేవతా
సమస్తలోకం భాష వలన నడుస్తున్నది.

**"తాం విశ్వరూపాః పశవో వదంతి**
**ఇదమంధం తమః కృత్స్నం జాయేత భువనత్రయమ్"**

భృా-అతచ్ (ఉణాదిః) భారత-భారతీ - అనగా లోకములను 'భరించేది' అని అర్థము.

2) లలిత పదాలతో నర్తిస్తూ ప్రపంచాన్ని నర్తింపచేయుటం, భరత సంబంధమయిన, గాన, కావ్య, నాటక, కళారూప సరస్వతికి సుప్రసిద్ధం. కనుక ఈ శ్లోకంలో లోకభారతిని, నాట్య భారతిని కలిపి భోజుడు ప్రస్తుతించాడు.

***శ్లో॥ ప్రవృత్తమక్షరాద్దివ్యం-స్వయమప్యక్షరాత్మకమ్।***
***సర్వతోప్యప్రవిహతం-స్రోతస్సారస్వతం స్తుమః॥*** **25**

**ప్రతిపదార్థము :** అక్షరాత్=అక్షరము నుండి, పరమాత్మ నుండి, ప్రవృత్తం= సాగినదియు, స్వయమపి=స్వయంగా, అక్షరాత్మకం=అక్షరస్వరూపమయి నదియు, ఆత్మరూప మయినదియు, సర్వతోపి=అన్నివైపుల, అప్రవిహతం= ఎదురు దెబ్బలేనిదియు, దివ్యం=స్వర్గ సంబంధమయినదియు అగు, సారస్వతం =సరస్వతీ సంబంధమయిన, స్రోతః=ప్రవాహమును, స్తుమః=స్తుతించెదము.

**భావము :** నాదమయీ స్తోత్రం ఇది. తరువాత వర్ణమయీ స్తోత్రం గూడా. అక్షరముల నుండి అక్షరరూపమయిన పదవాక్యాది రూపంగా అన్ని లోకాలలో అన్ని దిక్కుల ప్రవహించే సరస్వతీ శక్తికి నమస్కారము. అలానే అక్షర పరబ్రహ్మ లేదా ఓంకారనాదము నుండి పుట్టి అక్షర స్వరూపమై అంటే సగుణ బ్రహ్మ స్వరూపమై సర్వలోకవ్యాప్తమయిన ఆ పరానాదశక్తికి నమస్కారము.

**విశేషములు :**

1) ఇంతవఱకు జ్యోతిరూపంగా భావించిన కవి సరస్వతిని 'నదీరూపంగా' ఇందులో ప్రార్థన చేస్తున్నాడు. సరస్వతికి నదీరూపం సుప్రసిద్ధమే. ఆ సరస్వతి ఈ సరస్వతి అభిన్నమే అనటానికి సరస్వతీ రహస్యోపనిషత్తులోని మంత్రం ప్రమాణం.

**అంబితమే నదితమే-దేవితమే సరస్వతి** -సరస్వతీ రహస్యోపనిషత్

2) దేవతలంతా అక్షరసంభూతులేనని శంకరాచార్య సాక్ష్యం.

**యూయ మక్షరసంభూతాః** -ప్రపంచసారతంత్రం

ఇందులో శబ్ద సృష్టి అయితే అక్షరం అంటే నాదం, అక్షరాలు, అక్షరాధి దేవతలు వస్తారు. అర్థసృష్టి అయినచో అక్షరం అంటే పరబ్రహ్మం, ఆయన నుంచి వచ్చిన సృష్టి వస్తుంది. మన శరీరంలోను అక్షరాలు, అంతర్మాల, ఇంద్రియాలు అధిదేవతలు ఉన్నట్లు చెప్పాము కదా ! కనుకనే మంత్రం వలన దేవతలు ప్రసన్నులు కావడం జరుగుతుంది.

3) త్రిపథగ అయిన గంగకన్న లేదా పల్లానికి పోయే ఇతర స్రోతస్సుల కన్న ఈ సారస్వత స్రోతస్సుకు ప్రత్యేకత ధ్వనిస్తున్నది. కనుక ఇది వ్యతిరేకాలంకార ధ్వని.

4) **యద్వాఽ మూర్తం యచ్చ మూర్తం సమస్తం**
**యద్వా భూతేష్వేకమేకం చ కించిత్।**
**యద్దేవ్యస్తి క్ష్మాతలే ఖే న్యతోవా**
**తత్సంబంధః త్వత్స్వరైః వ్యంజనైశ్చ॥**

అశ్వతరుని ఈ సరస్వతీ స్తుతిలో సమస్త సృష్టికి వర్ణ సమామ్నాయానికి సంబంధం ఉన్నదని చెప్పబడింది.

***శ్లో॥ సూక్ష్మాదిభిః ప్రవృత్తం యత్–చతుర్భిః పథిభిః మహత్।***
***స్వర్ధునీ స్పర్ధయేవోచ్చైః–వాక్స్రోతస్తత్పునాతు నః॥*** **26**

**ప్రతిపదార్థము :** సూక్ష్మాదిభిః=సూక్ష్మ మొదలగు, చతుర్భిః=నాలుగు, పథిభిః=మార్గముల చేత, స్వర్ధునీ=గంగానదితో, స్పర్ధయేవ=పోటీతోవలె, ఉచ్చైః=ఉన్నతంగా, యత్=ఏ స్రోతస్సు, ప్రవృత్తం=సాగినదో, మహత్=గొప్పదయిన, తత్=ఆ, వాక్స్రోతః =వాక్ప్రవాహం, నః=మనలను, పునాతు=రక్షించు గాక.

**భావము :** స్థూలము, సూక్ష్మము, కారణము, తురీయం అనే స్థితుల ద్వారా లేదా పర, పశ్యంతి, మధ్యమ వైఖరి అనే స్థితుల ద్వారా వాఙ్మయనది గంగానదితో పోటీపడి ప్రవహించుచున్నది. గంగ త్రిపథగ అని పేరు. 3 లోకాల్లో ప్రవహిస్తున్నది కనుక ఆ పేరు వచ్చింది. కాని వాక్కు '4' పథములలో ప్రవహించి 'చతుష్పథగ' అయినది.

**విశేషములు :**

1) ఇందులో హేతూత్ప్రేక్షాలంకారము. వాక్కు '4' రకాలుగా ప్రవహించటానికి కారణం 'గంగానది'తో పోటీ అని ఊహింపబడినది. కనుక హేతువు కానిది హేతువుగా ఉత్ప్రేక్షింప బడినది కనుక 'హేతూత్ప్రేక్ష'.

2) ఇందులోనూ సూక్ష్మంగా మొదలయ్యే పరా మొదలగు దశలు చెప్పబడినవి.

**యదా స్వయం వ్యంజయితుం యతేత–మహీయసీ సా కరణైః క్రమేణ।**
**తదా తు బిందుస్ఫుటనోద్భవస్య–రవస్య సమ్యక్ ప్రవిజృంభితం స్యాత్॥**

బిందుస్ఫుటనోద్భవం అయిన ధ్వని అత్యంత సూక్ష్మం. అది క్రమంగా విజృంభిస్తుంది. ఎలా అంటే

**"మూలాధారాత్ ప్రథమముదితో–యస్తుభావః పరాఖ్యః**
**పశ్చాత్పశ్యంత్యథ హృదయగో–బుద్ధియుఙ్మధ్యమాఖ్యః**
**వక్త్రే వైఖర్యథ, రురుదిషోః అస్య–జాతస్సుషుమ్నా**
**బద్ధస్తస్మాద్భవతి పవనప్రేరితో–వర్ణసంఘః"**

మూలం=మాయాశక్తి, ఆమెకు ఆధారం మూలాధారం. దానినుంచి సూక్ష్మమయిన పరానాదం. అది క్రమముగా హృదయంలో పశ్యంతిగా, బుద్ధిగతమై మధ్యమగా, ముఖగతమై వైఖరిగా చివఱకు సుషుమ్నా గతమయి శ్వాసతో గలిసి అక్షరరూపంగా ఏర్పడుతుంది. ఆవిధంగా 4 గతులు గలది పరావాక్కు అని చెప్పవచ్చును.

**శ్లో॥ *అజడం యత్స్వరూపేణ-తథాప్యతిరసాపగమ్।***
***అణీయో వ్యాప్తిమదపి-వాక్స్రోతః పాతు తన్నవమ్॥*** **27**

**ప్రతిపదార్థము :** యత్=ఏ స్రోతస్సు, స్వరూపేణ=స్వరూపరీత్యా, అజడం= జడమయినదిగాదో, తథాపి=అయినను, అతిరసాపగమ్=మిక్కిలి రుచిగల నదిగలదో, అణీయఃఅపి=అత్యంత సూక్ష్మమయినదయినను, వ్యాప్తిమత్= వ్యాపక స్వభావం గలదో, తత్=ఆ, నవమ్=క్రొత్త/వింత అయిన, వాక్ స్రోతః='వాక్' అను, స్రోతః=ప్రవాహము, పాతు=రక్షించుగాక !

**భావము :** జడముకానిది అయినను అతిరుచిగల నదులుగలది, అతి సూక్ష్మమయినది అయినను వ్యాప్తిగలది అగు వింత వాక్ప్రవాహము రక్షించును గాక !

**విశేషములు :**

1) జడం=లడయోరభేదః అను న్యాయం ప్రకారం 'జలం' అవుతుంది. అజడం=అజలం అవుతుంది. జలముకానిది జలములేనిది అని అర్థం వస్తుంది. అయినను అతిరసమయిన 'ఆపగలు' అనగా నదులు గలది అని అర్థం వస్తుంది. ఇది విరోధం. 'నీళ్ళు లేనిది - నదులు కలది' అనే గుణాలు పరస్పర విరుద్ధం కదా ! కనుక జడము కానిది రసనదులు గలది అని చెప్పవచ్చు. జడము కానిది జలసమృద్ధిగల నదులు గలది అని చెప్పవచ్చును. అతి రసమయిన కావ్యాలు అనే నదులు గలది అని చెప్పవచ్చును.

2) 'సరస్వతి' అనే పేరులో 'అతిరస' అనే అక్షరాలు గలవు. అట్టి అక్షరాలుగల సరస్వతి అనే నది అయినది అని చమత్కరించవచ్చును. అతిరస అంటే అరిసెలు అని అర్థం. అరిసెలయినది అంటే మధురమయినది అని చెప్పవచ్చును.

3) అతిరసాపహం/అతిరసావహం అని పాఠాలు ఉన్నాయి. కాని వీటికన్న 'అతిరసాపగం' అనడమే శ్రేష్ఠము.

4) విరోధాభాసంతో వచ్చిన వ్యతిరేకాలంకారము.

**శ్లో॥ యదనాది స్వరూపేణ-నవం యచ్చ క్షణే క్షణే।**
**వినాశ్యథ చ యన్నిత్యం-తద్వాఙ్మధు ధినోతు నః॥ 28**

**ప్రతిపదార్థము :** స్వరూపేణ=స్వరూపరీత్యా, యత్=ఏది, అనాది=ఆది లేనిదో, యచ్చ=ఏది, క్షణేక్షణే=క్షణక్షణము, నవం=నూతనమయినదో, అథ చ= తరువాత, యత్=ఏది, వినాశి=నశించునట్టిదో, నిత్యం=శాశ్వత మయినదో, తత్=ఆ, వాఙ్మధు=వాక్యమకరందము, నః=మనలను, ధినోతు=సంతోష పఱచుగాక !

**భావము :** అసలు రూపం రీత్యా అంటే పరబ్రహ్మ రూప స్థితిలో ప్రాచీనం అయినను నాదరూపంగా ప్రతిక్షణము నూతనమయినది, అసలు రూపం రీత్యా నిత్యమయినది, నాదరూపంగా నాశంగలది అయిన "వాక్కు" అనే తేనె మనలను సంతోషపఱచుగాక!

**విశేషములు :**

1) అనాది–అంటే 4 అర్థాలున్నాయి.

1) 'న' ఆదియందు లేనిది "న" (నవంలో)

2) ఆది లేనిది – పరబ్రహ్మగా, మాయగా etc.,

3) నాదము లేనిది – 'పరా' స్థితిలో

4) 'అన' శ్వాస కావచ్చును. శ్వాస ఆదియందు కలది – నాదము అని చెప్పవచ్చును.

తరువాత 'నవం' అన్నాడు. ఇది

1) 'న' ఆదియందు గలది

2) ఆదిగలది – క్రొత్తది గనుక

3) నవం – 'న–వాతి' అనే అర్థంలో గాలికానిది – నాదంగా మారినది.

అట్లే మొదటి 'అనాది' – అర్థం ప్రకారము 'నవం' – న లేనిది. "వం" అమృత స్వరూపమయినది. లేదా వాయుస్వరూపం అయినది అని అర్థం చెప్పవచ్చును.

3) అనాది – 'న' ఆదియందు లేనిది = వం

నవం – 'న' ఆదియందు గలది అని విరోధాభాసాలంకార ధ్వని.

4) 'వి' పక్షి. ప్రస్తుత సందర్భం – 'మధు' కనుక తేనెటీగ, తుమ్మెద. వీనివలన వ్యాపించేది అని అర్థం.

3) స్ఫోటరూపంగా 'ధ్వని' అనాది, నిత్యము. వర్ణపదాది ధ్వనిరూపంగా వినాశి, ప్రతిక్షణ జాయమానము.

4) వం=అమృతం, నిత్యం – నవం=మృతం, వినాశి

5) తేనె – జాత్యానిత్యం – అనాది. విశేషరూపంగా – అనిత్యం, వినాశి. క్షణక్షణము తేనెటీగలచే తయారయినట్టిది.

6) కావ్యరూపవాక్కు – నిత్యము, యశస్కరం, ఉత్తమాటలు = వినాశి.

7) **అర్థా నిత్యా యే వినశ్యంతి చాన్యే**
**యేర్థాః స్థూలా యేతి సూక్ష్మాతిసూక్ష్మాః।**
**యేవా భూమౌ యేంతరిక్షేన్యతో వా**
**తేషా మేషా త్వత్త ఏవోపలబ్ధిః॥** – అశ్వతరుని సరస్వతీస్తుతి

నిత్య, అనిత్య స్థూల, సూక్ష్మ పదార్థజాతం అంతా సరస్వతి నుంచి వచ్చిందని అర్థం. అవి అన్నియు ఆమె స్వరూపం. అందువలన ఆ వస్తు ధర్మాలన్ని సరస్వతి నుంచి వచ్చినవే కనుక అవి ఆమెయందున్నట్లు.

**శ్లో॥ *ఆపీయమానమనిశం-సర్వైః కవిమధువ్రతైః।***
***సర్వం తత్ వృద్ధిమేవైతి-యత్త జ్జయతు వాఙ్మధు॥*** **29**

**ప్రతిపదార్థము :** సర్వైః=అందఱు, కవి=కవులనబడు, మధువ్రతైః=తుమ్మెదలచే, అనిశం=నిత్యం, ఆపీయమానం=బాగా త్రాగబడుచున్నదై, సర్వం=సమస్తము, వృద్ధింఏవ=అభివృద్ధినే, యత్=ఏ కారణముచే, ఏతి=పొందుచున్నదో, తత్=అందువలన, తత్=ఆ, వాఙ్మధు=వాఙ్మకరందము, జయతు=జయించును గాక !

**భావము :** సమస్త కవిభ్రమరములు త్రాగుచున్నను ఈ వాఙ్మధువు తగ్గకపోగా వృద్ధిపొందుచుండును. అందువలన అట్టి వాఙ్మకరందము వైభవముగా అలరారు గాక !

**విశేషములు :**

**వ్యయే కృతే వర్ధత ఏవ నిత్యం** – భర్తృహరి
**"సరస్వత్యే వైషా ఘటయతి-యథేష్టం భగవతీ"** – ధ్వన్యాలోకం
ఈ భావములు ఇందులో వచ్చినవి.

**శ్లో॥ *యదభిన్నం స్వభావేన-భాషాభేదైస్తు భిద్యతే।***
***భిన్నాభిన్నస్వరూపం చ-సజ్జ్యోతిస్తదుపాస్మహే॥*** **30**

**ప్రతిపదార్థము :** యత్=ఏది, స్వభావేన=సహజస్థితితో, అభిన్నం=భేదములు లేనిది, భాషా=భాషల యొక్క, భేదైస్తు=భేదముల చేత, భిద్యతే=భేదించునో, ఆ విధముగా, భిన్న=భేదము గల, అభిన్న=భేదములేని, స్వరూపంచ= స్వరూపము గలదో, తత్=ఆ, సత్=ఓంకారము అనబడే/సత్యమయిన, జ్యోతిః=వెలుగును, ఉపాస్మహే=ఉపాసించెదము.

**భావము :** అసలు స్వభావరీత్యా బ్రహ్మాభిన్నము లేదా నాదరూపము, భాషా భేదముల వలన మతభేదముల వలన భిన్నము అనగా వర్ణరూపము, దేవతా రూపము – కనుక భిన్నాభిన్న స్వరూపం అయిన ఆ "వాక్" జ్యోతిని, శబ్ద బ్రహ్మను ఉపాసించెదము.

**విశేషములు :** 1) స్వభావేన=నాదరూపంగా తన ఉనికితో, 'అ'=పరమశివ ప్రకాశము కన్న, భిన్నం=స్పంద రూపంగా బయటకు వచ్చేది అని ఓంకారం గూర్చి చెప్పవచ్చును.
"సదోంకారో నిగద్యతే" అనడం వలన "సత్" అనగా ఓంకారము.

2) స్వభావేన=స్వస్వరూపరీత్యా, అభిన్నం అఖండమయినది-బ్రహ్మము –

స్ఫోటము. కాని భాషా=భాషలు, భాషింపబడిన మతములు – "ఏకంసత్ విప్రాబహుధా వదంతి" అన్నట్లు వీటివలన భిన్న దేవతలుగా, భిన్న భాషలుగా వచ్చినవి.

3) లేదా అక్షరాలన్నీ ఒకే రూపం. స్వరవ్యంజనాలన్నీ ఏ భాషలోనయినా ఉచ్చారణలో అవే. కనుక అక్షర నాదవిధానం ఒక్కటే కాని భాషల వలన లిపిభేదం, అర్థభేదం అనియు చెప్పవచ్చును. ఈ విధముగా భిన్నము అభిన్నము అయిన స్వరూపము వాగ్దేవిది.

ఉదా॥ అన్ని శరీరాలు రక్తమాంసరీత్యా ఒక్కటే. కాని నామరూప రీత్యా భేదం. అన్ని సొమ్ములు బంగారమే. గొలుసు, గాజు మొ॥ నామ రూపాలరీత్యా భిన్నము. అలా ఇది.

4) **ఏవం దేవి త్వయా వ్యాప్తం–సకలం నిష్కలం జగత్।**
**అద్వైతావస్థితం బ్రహ్మ–యచ్చ ద్వైతే వ్యవస్థితమ్॥** – అశ్వతరుని – సరస్వతీస్తుతి

దీని ప్రకారము సకల ప్రపంచము నిష్కల బ్రహ్మము, ద్వైత బ్రహ్మ, అద్వైత బ్రహ్మ – మొత్తం సరస్వతి అని తేలుచున్నది.

**శ్లో॥ *నమో వాగ్దేవతే తుభ్యం–నమస్తుభ్యం సరస్వతి।***
***వాణి! భాషే! నమస్తుభ్యం,–బ్రాహ్మి! తుభ్యం, నమోనమః॥* 31**

**ప్రతిపదార్థము :** వాగ్దేవతే=వాగ్దేవీ!, తుభ్యం=నీకు, నమః=నమస్కారము, సరస్వతి!=సరస్వతీ!, తుభ్యం=నీకు, నమః=నమస్కారము, వాణి!=ఓ వాణీదేవీ!, తుభ్యం=నీకు, నమః=నమస్కారము, బ్రాహ్మి=ఓ బ్రహ్మాణీ!, తుభ్యం=నీకు, నమోనమః =నమస్కారద్వయం.

**భావము :** ఓ వాగ్దేవీ! నీకు నమస్కారము, ఓ సరస్వతీ! నీకు నమస్కారము. ఓ వాణీ ఓ భాషా – నీకు నమస్కారము. ఓ బ్రాహ్మీ! నీకు నమస్కారము.

**విశేషములు :**

1) ఇవి '2' వ శ్లోకంలో చెప్పిన పదాలే. స్తోత్రంలో తత్త్వవర్ణన అయిన తర్వాత 'నామ' వర్ణన చేస్తున్నాడు. మంత్రపుష్పరూపంగా నమస్కార సమర్పణ జరిపాడు.

2) ఇందులోను బ్రాహ్మి – పరావాక్కు
వాగ్దేవతా = పశ్యంతి, సరస్వతి = పశ్యంతి, వాణి = వైఖరీ
భాష = వైఖరీ వ్యాప్తి–ఇలా తీసికొనవచ్చును. లేదా
బ్రాహ్మి=వేద సరస్వతి (బ్రహ్మ = వేదం కనుక), వాక్కు= నాదమయి
సరస్వతి=సుషుమ్నానాడి/నది రూపం, వాణి=పశుపక్ష్యాదుల ధ్వనులు,
వీణాదుల ధ్వనులు, భాష=మనుష్య భాషలు అలానూ దర్శింపవచ్చును.

"తాం విశ్వరూపాః పశవో వదంతి"

*శ్లో॥ అనిమేషి సర్వదోదిత-మస్ఖలితం విశ్వదర్శమమలఞ్చ।*
*అపనిద్రమపతమస్కం-చక్షుః సారస్వతం జయతి॥* **32**

**ప్రతిపదార్థము :** అనిమేషి=రెప్పపాటు లేనిది, సర్వదా=ఎల్లపుడు, ఉదితం= ఉదయించినది, చెప్పబడినది (కీర్తిగలది), అస్ఖలితం=పొరపాటు పడనిది, విశ్వ=ప్రపంచమును, దర్శం=చూపించునది, అమలంచ=నిర్మలమయినది, "పుసి" లేనిది, అపనిద్రం=నిద్ర లేనిది, అపతమస్కం=తిమిరము అను రోగము లేనిది, చీకటిలేనిది, అజ్ఞానము లేనిది అగు, సారస్వతం=సరస్వతీ సంబంధ మయిన, చక్షుః =(జ్ఞాన) నేత్రము, జయతి=జయించును.

**భావము :** మామూలు కన్ను కన్న భిన్నమయినది ఈ విద్యానేత్రం. దీనికి ఱెప్పపాటు లేదు. సర్వదా తెఱచుకొని ఉంటుంది. పొరపాటు పడదు. తొట్రుపాటు రాదు. ప్రపంచ దర్శనం చేయిస్తుంది. పుసి, కన్నీళ్ళు మొ॥ మాలిన్యం ఉండదు. దీనికి నిద్రలేదు, చీకటి లేదు, తిమిరరోగం లేదు, అజ్ఞానం లేదు. ఇట్టి కన్ను జయించును.

**విశేషములు :** ఇందు వ్యతిరేకాలంకారము.

*శ్లో॥ సారస్వతం వపురివాతివిశుద్ధవర్ణం*
*లోకత్రయీమపి విశచ్ఛ యశో యదీయమ్।*
*చేతాంసి మోదయతి భోజనృపేణ తేన*
*వాగ్దేవతాస్తుతిరియం రుచిరా వ్యధాయి॥* **33**

**ప్రతిపదార్థము :** సారస్వతం=సరస్వతీ సంబంధమయిన, వపురివ=శరీరము వలె, అతి=మిక్కిలి, విశుద్ధ=నిర్మలమయిన, వర్ణం=రంగు గలది, అక్షరములు గలది, లోకత్రయీ మపి=ముల్లోకములను గూడా, విశచ్ఛ=ప్రవేశించునదియు అయిన, యదీయ=ఏ రాజుకు సంబంధించిన, యశః=కీర్తి, చేతాంసి= మనస్సులను, మోదయతి=సంతోషపఱచునో, తేన=ఆ, భోజనృపేణ= భోజరాజు చేత, ఇయం=ఈ, రుచిరా=అందమయిన, వాగ్దేవతాస్తుతిః= వాగ్దేవీ స్తుతి, వ్యధాయి=రచింపబడెను.

**భావము :** భోజరాజు యొక్క కీర్తి సరస్వతీ శరీరంవలె అతినిర్మలమయినది. లోకత్రయ వ్యాపిని. పండిత మనోరంజకము. అట్టి భోజరాజు ఈ అందమయిన వాగ్దేవీ స్తోత్రాన్ని రచించెను.

**విశేషములు :**

1) వాక్=పలికే, దేవత=దేవి, ఈమె పలికే దేవత. కనుక ఏ దేవతను పిలిచినా ముందుగా ఈ దేవతనే పలకాల్సి ఉంటుంది. కనుక వాగ్దేవత.

2) భోజరాజు యొక్క యశః కాయం పరిపాలకుడుగా గాక సాహిత్యవేత్తగానే అనే సంగతి ఆయనకే తెలుసును. అందుకే "సారస్వతం వపురివ సారస్వతం యశః " అని ఉభయాన్వయానికి పనికివచ్చే అవకాశం ఇచ్చాడు.

**"కావ్యం యశసే"** కదా !

3) వర్ణం=కీర్తిలో ఉండే నిర్మలమయిన అక్షరాలు. అంటే భోజరాజు మంచివాడు కవి, రచయిత. ఇలా శుభ్రవర్ణాలుంటాయి.

4) సారస్వత శరీరము త్రిలోక వ్యాపి. అలానే భోజ కీర్తి శరీరం గూడా. సారస్వత శరీరం మనోరంజకం, భోజరాజ యశస్సు అంతే. భోజరాజుగారి సారస్వత శరీరంగూడా ఇట్టిదేనని సూచన.

శ్లో॥ ***అనుష్ఠితేషు కావ్యేషు-షణ్మాసం య ఇదం జపేత్।***
***అనధీతశ్రుతస్యాపి-కవిత్వం తస్య జృంభతే॥*** **34**

**ప్రతిపదార్థము :** కావ్యేషు=కావ్యములు, అనుష్ఠితేషు=ప్రారంభింపబడగా, యః=ఎవడు, షణ్మాసం='6' నెలలు, ఇదం=ఈ స్తోత్రమును, జపేత్=జపించునో, తస్య=వానికి, అనధీతశ్రుతస్యాపి=అధ్యయన శ్రవణములు లేనివాడయినను, కవిత్వం=కవిత, జృంభతే=విజృంభించును.

**భావము :** కావ్యములు వ్రాయాలని సంకల్పించినవాడు - ఎంత చదువు సంధ్యలు లేనివాడయినను - 6 నెలలపాటు ఈ స్తోత్రం పారాయణ చేస్తే అతనికి కవిత్వం విజృంభిస్తుంది.

**విశేషములు :**

అనుష్ఠితేషు=అన్నచోట, భూతార్థంలో క్తప్రత్యయం అర్థానికి కుదరదు. ఆదికర్మణిక్తః కర్తరిచ అన్న సూత్రం ప్రకారం 'ఆదికర్మార్థం'లో క్త ప్రత్యయం చెప్పాలి. అనగా కావ్యం వ్రాయడం ప్రారంభం అయింది. ఇంతవఱకే భూతకాలం. వ్రాయడం పూర్తి కాలేదు. ఈ స్థితిలో ఈ స్తోత్రం వలన సహాయం జరుగుతుందని అర్థము.

ఇది భోజరాజకృత వాగ్దేవీ స్తుతి
కచ్ఛపీ వ్యాఖ్య సమాప్తము

**"అస్మిన్ జన్మని మత్కవిత్వవపుషా యావిష్కృతా మే ముఖాత్**
**ఆచార్యద్వయబోధసాధితపదా వాల్మీకిమౌనేర్యథా।**
**శోకాన్ దైవహతస్య మే యదకరోత్ శ్లోకాన్ మమానందదాన్**
**'ఆజన్మాంతసఖీ' భవేతి జననీం వందే గిరం తాం సుఖీః॥"**

